శ్రీ అరవిందయోగి

# సావిత్రి

రెండవ పుస్తకం

## అన్వేషణ

తెలుగుసేత

శార్వరి

SAVITRI – Book 2 : ANVESHANA
(Divine Mother-Birth & Quest)

Original
SRI AUROBINDO

Adoptation
SRI SARVARI

Title Design : CHANDRA

First Edition Oct. 81
Price : Rs 10-00



SARVARI PUBLICATIONS
Plot 55, P & T Colony,
GANDHINAGAR,
HYDERABAD-500 380.

Printed at :
AWARE PRINTING PRESS
2-2-1167/8/9, Tilaknagar,
HYDERABAD - 500 044.

# సుహృల్లేఖ

S.V. Bhujangaraya Sarma
Head of the Dept. of Telugu

Jawahar Bharathi
K a v a l i

శ్రీ అరవిందుల సావిత్రి చదవండి.
లోలోపల కాదు, పైకి.
అలా వూరికే చదువుతూ పోండి.
ఎక్కడా ఆగి ఆలోచించకండి, వ్యర్థం.

ఆలోచించడమనేది పూర్తిగా మానేసి చదవండి.
సావిత్రి వేదఋక్కుల్లా వినబడుతుంది.

అలా వింటోంటే -
కాస్సేపటికి మురికి వదిలి
మనస్సు తేలిక పడుతుంది.

అంతరంగంలో -
తెలియని కొత్తవాకిళ్లేవో
మెత్తగా తెరుచుకుంటున్నట్టనిపిస్తుంది.

ఎన్నడూ సోకని కొత్తగాలులేవో
చుట్టూసుఖంగా పారాడుతున్నట్టనిపిస్తుంది.

అనుభవానికిరాని కొత్త సుగంధమేదో
ప్రియంగా ఆవరించుకున్నట్టనిపిస్తుంది.

వూదారంగు ఆవిరి, నీలిరంగు పొగమంచు,
నారింజరంగు శాంబరం మిమ్మల్ని చుట్టేసుకుని,
ఉక్కిరిబిక్కిరిచేసి, ఎక్కడికో ఎగరేసుకుపోయి,
మీకళ్ళముందరే సుడులు తిరుగుతూ
గోళాలు గోళాలుగా ముద్దకడుతున్నట్టనిపిస్తుంది,

మీదికి వారిగిపోతున్న చిలకపచ్చ మబ్బుల్లోంచి
కుండపోతగా బంగారువాన కురిసి
మీరు ముద్దైపోతారు.

మీరు చూస్తుండగానే ఆ మబ్బులు రంగులు మారుతాయి.
మృదుస్వర కాదంబినిగా మీ మీద వాలిపోతాయి.
అమృతపు మడుగులా మిమ్మల్ని ముంచెత్తుతాయి.

మీరు ఆనందంతో ఉద్దు గుడుచుకుంటారు.
పారవశ్యంతో గిలగిల్లాడిపోతారు.

మీ అల్పత్వం మీక్కు తెలిసివచ్చి,
మీ అహంకారం మాసిపోయి,
జిజ్ఞాస మొదలవుతుంది.

అక్కడ్నించి కొత్త బ్రతుకు.

అలా మొదలయిన కొత్తబ్రతుకు
పూర్ణయోగంగా యెలా మారుతుందోచిత్రించారు,
శ్రీ అరవిందులు సావిత్రిలో.

'అధిమానస' స్థాయిలో మహాయోగి పొందే
దర్శనానికి అనుభూతికీ
అతిలోకమైన కవితాభివ్యక్తి సావిత్రి.

దాన్ని తెలుగుచేయటం మాటలుకాదు.

సావిత్రిని శార్వరి తెలుగుచేస్తున్నాడని విన్నప్పుడు
అతడి సాహసానికి నివ్వెరపోయాను.

తెలుగు సావిత్రి మొదటి భాగం చదివినప్పుడు
అతడి ప్రతిభాపరిణతికి మళ్ళీ నివ్వెరపోయాను.

ఇప్పుడు - తెలుగు సావిత్రి
రెండోభాగాన్ని మూలంతో పోల్చిచదివి
అతడి 'భవ్యకవితావేశా' నికి
మరోసారి నివ్వెరపోతున్నాను.

ఇది అనువాదంకాదు
అనువాదంచిలకపలుకు.

ఇది 'వినిర్మితి'.
అంటే - విశిష్టమైన నవసృష్టి.
తెలుగులో తిక్కన్నగారు చేసినంత పని.

కాకుంటే -
ఇంత సరళ సుందరమైన ప్రావాహిక శైలిలో
తెలుగు సావిత్రి అవతరించి వుండేది కాదు.

నిజానికి - శ్రీ అరవిందులను
అర్థం చేసుకోవడమనేది,
అసలు, లేదు.
వారిని అనుభూతికి తెచ్చుకోవలసిందే.

వారు భాషకు లొంగరు,
మేధకు లొంగరు,
భావనకు లొంగరు.

వారిని అనుభూతికి తెచ్చుకోగల సహృదయత
అలవిమాలిన కవితాత్మగల
యోగికి మాత్రమే సహజం.

శార్వరి యోగి, కవి.
అతడికి నూరేళ్లు.

అతడి తెనుగుసేతకు
సావిత్రి బ్రతికినన్నేళ్లు.

కావలి
6-10-81

యస్వీ భుజంగరాయశర్మ

Dr. V. N. Sharma
The Children's Garden School,
Mylapore,
Madras-4

శ్రీ శార్వరి గారికి,

మీ రచనలను ముఖ్యంగా ఆధ్యాత్మిక లోకానికి సంబంధించిన వ్రాతలను "ప్రభ"లో పూర్వపు రోజుల్లో చదువుతూ, ఆనందిస్తున్న పాఠకులలో నేనూ ఒకడ్ని.

మీరు ఈమధ్య ప్రచురించిన "సావిత్రి" ఇప్పుడే, అదృష్టవశాత్తు నా చేతికి అందింది. మీ ఆంధ్రీకరణ అద్భుతమైంది. ఆ పనికి సి. వి. వి. వారి సాధన మీకు ఎంతో చేదోడుగా ఉన్నదన్న సంగతి సులభంగా గుర్తించవచ్చు. శ్రీ అరవిందుల అనువాదాలు ఎన్నో తెలుగులోకి వచ్చాయి. ఒక్క శివరామశాస్త్రిగారి, వారి సోదరులు చంద్రశేఖరంగారి అనువాదాలు మినహాయించి, ఇతరుల తెలుగు అనుకరణ చదవటానికి బదులు మూలగ్రంథాలకేసి నడవడమే అన్నివిధాలా మంచిదని అనుకుంటూన్న నన్ను మీ రచన నా అభిప్రాయాన్ని మారుస్తూ ఎంతో ఉత్తేజపరిచింది. ఇందుకు మిమ్మల్ని అభినందించటంతో తృప్తిపడటం నాకు ఇష్టంలేదు. "సావిత్రి"ని మీరు పూర్తి చేయటం అవసరం. అది పూర్తిచేసిన తరువాత శ్రీ అరవిందుల ఇతర రచనలనికూడా తెలుగులోకి తీసుకువిరావాలి. ఇదే నా ఆశ మీవంటి రచయితల నుంచి—

—వి. ఎన్. శర్మ

## జ గ న్మా త



## సా వి త్రి



## మ హో ద య ం

సావిత్రి - మహాకావ్యం

రెండవ పుస్తకం 'అన్వేషణ'

ప్రచురణ నిమిత్తం ఆర్థిక సహాయం

అందజేసిన

ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వానికి —

ముఖ్యమంత్రి

శ్రీ టి. అంజయ్యగారికి -

సాంస్కృతిక వ్యవహారాల మంత్రి

శ్రీ భాట్టం శ్రీరామమూర్తిగారికి

కృతజ్ఞతలు

# అన్వేషణ

సృష్టి పరిణామంలో మానవుడు ఎంతో విజ్ఞానం సంపాదించుకున్నాడు. సంస్కృతిని, నాగరికతను తనవిగా చేసుకున్నాడు. ఎన్నో ఘన విజయాలు సాధించాడు. మరెన్నో సాధనలు చేశాడు. తపస్సు చేశాడు విజ్ఞాన మానవునికి ప్రతినిధి అశ్వపతి మానవ ప్రగతికి, వికాసానికి అతను ప్రతినిధి. అతనే మానవత—అతనే మానవుడు. యోగసాధనతో అశ్వపతి సంపూర్ణత్వం సాధించాడు. పరిణామాన్ని యోగదృష్టితో దర్శించాడు. ఇంకా పైకి, పైపైకి వెళ్ళడానికి ఉద్యమించాడు. అతను గతాన్ని గమనించాడు, గమించాడు. వర్తమానాన్ని చూచాడు. భవిష్యత్తును దర్శించాడు, త్రికాలజ్ఞుడైనాడు. అయి, కాలాన్ని దూరాన్ని జయించాడు. అటు ఊర్ధ్వలోకాలు అధోలోకాలు దర్శించాడు. అటు తేజోమండలాలలో, ఇటు అంధకార తమోమండలాలలో అనుభవాలు పండించుకున్నాడు. అతను తనది చేసుకున్న విజ్ఞానం అనంతం. అజ్ఞానాన్ని ఛేదించే అనంతశక్తిని యోగసాధనతో సంపాదించాడు చీకట్లను చీల్చి, ప్రజ్ఞను క్రాంతిచే స్వంతం చేసుకున్నాడు.

అయినా అతనికి తృప్తిలేదు. యోగసాధనవల్ల కలిగే ఫలితాలు సాధకునకే పరిమితాలు అతనిలో మాత్రం మార్పుకు దోహదం చేస్తాయి. కానీ ప్రపంచానికి ఏం లాభం? ప్రాపంచిక జీవనం యథాతథంగానే, కష్టసుఖాల సమ్మిశ్రమంగానే ఉంటున్నది అసమగ్రమూ, అసంపూర్ణము అయిన మానవుడిలో ఏమాత్రం మార్పు రావటంలేదు ఏదోదివ్యత్వం లోపించింది. సత్యం దూరంగా ఎక్కడో మిణుకు మిణుకు మంటున్నది. ఆశ కనిపిస్తున్నది. సాధకుడు సత్యానికి చేరువ కాగానే, ' అది దూరంగా తొలగిపోతున్నది – లేదా అంతర్ధానమై పోతున్నది.

అశ్వపతి ఓటమిని అంగీకరించదలచలేదు. సత్యాన్ని అందుకోవాలని, సుస్థిరం చేసుకోవాలని దృఢంగా సంకల్పించాడు. ఎప్పటికో సాధించగలమన్న ఆశ చాలదు. ఆ స్వరం, దివ్యత్వం భూమిపైననే అనుభవించగలగాలి. ఆ దివ్య

శక్తిని భూమిపైన అవతరింపచేయగలగాలి. పృథ్వి ప్రకృతిని దివ్య ప్రకృతిగా మార్చగలగాలి.

అశ్వపతి మూడవమారు యోగసాధన చేయసాగాడు. కొంతకాలం దారి, తెన్ను కనిపించలేదు. అంతా శూన్యం, నిరుత్సాహం. అవిరామంగా సాధన కొన సాగించాడు. ఈ లోకపు ఎల్లలు గడచిపోసాగాడు ప్రపంచాన్ని దాటి పోయాడు. అజ్ఞానాంధకారం వదిలిపోయింది. కొత్త ప్రపంచమేదో కట్టెదుట సాక్షాత్కరించింది. అతని పిలుపుకు స్పందన తోడైంది. రూపం, చలనం, ధ్యానం, మనస్సు, హృదయం, ఏకాగ్రత ఏవీ అవసరంలేని స్థితికి చేరుకున్నాడు. రూప ప్రపంచాన్ని దాటి అరూప ప్రపంచాన్ని చేరుకున్నాడు. అది దివ్యం – అది నిశ్శబ్దం– అది ప్రశాంతి—

ప్రపంచం ఇవ్వగలిగినదంతా అతిస్వల్పం
ప్రాపంచిక విజ్ఞానం, శక్తి – కాలబహూకృతులే
అవి పవిత్రమైన ఆధ్యాత్మిక తృష్ణను తీర్చలేవు

మహత్వ పూర్ణరూపాలన్నీ ఏకైక పరమాత్మ రూపాలైనా
పరమాత్మ అనుగ్రహానికే మన జీవితాలు కట్టుపడినా
చేరువైన ఆత్మకన్న అవి ఎక్కువ సన్నిహితాలైనా
మనం మనంగా మనగలిగే ఒక కఠోరసత్యం అది.
స్వయంకృతాలవల్ల అది అతిదూరం అనిపిస్తుంది.
ఇప్పుడది అగమ్యం, అగోచరం, నిర్గుణం, నిరామయం.

అన్నిటికి అందాన్ని పంచిన పరమాత్మసౌందర్యం కనిపించదు
మహత్తులు కోల్పోయిన తర్వాత నిర్జీవ చిహ్నాలవి.
ప్రియుడు నిర్గమించిన తర్వాత ప్రియురాలివలె
ప్రపంచం లక్ష్యం కోల్పోయి శూన్యంగా బ్రతుకుతుంది.

జ్ఞానార్జనకృషి వ్యర్థ మానసికశ్రమ అనిపిస్తుంది
యావత్ విజ్ఞానం అవ్యక్తంలో అంతమవుతుంది
ఏదో శాసించాలన్న ప్రయత్నం నిష్ఫల అహంకారం
కష్టించి సాధించుకున్నవాటిని కాలం త్రోసివేస్తుంది

అన్నిశక్తులు ఈశ్వరీయతలో లీనమై పోతాయి.
ఒక అంధకారగుహ అనంత దివ్యతేజస్సును రక్షిస్తుంది.
అతని వేదనాహృదయంలో నిశ్శబ్దం నెలకొన్నది
ప్రాపంచిక వాంఛల రోదనలనుండి నిర్గమించి
అతను పరమాత్మపిలుపుకు సంసిద్ధుడైనాడు.
అనామకంగా, అతి సన్నిహితంగాఉన్న జీవుడు
తనలో సచ్చిదానందాన్ని, శాంతిని అప్రతిహతంగా
అనుభవించినా, ఇంకా పొందవలసింది ఉంది
పరలోకం సదా తనను ప్రలోభపెడుతూ,
అన్వేషణలో అందినట్లే అంది అంతర్ధానమవుతుంది.
అది కోరనప్పుడు చేరువై, కోరినప్పుడు దూరమవుతుంది
అది అందించే ఆనందంతప్ప మరేదీ తృప్తి కలిగించదు.
అది లేనపుడు మహా ఘనకార్యాలు నిర్జీవాలవుతాయి,
అది ఉన్నప్పుడు అల్పకార్యాలే దివ్యంగా భాసిస్తాయి.
అది ఉన్నంతకాలం శూన్యం హృదయం నిండుగా ఉంటుంది
ఉద్ధరించగల దివ్యత్వం మాయమైనప్పుడు
అస్థిత్వమే లక్ష్యంకోల్పోయి జడప్రాయమవుతుంది.

క్రమంగా ఏర్పడిన అనంత స్మృతిసీమలు
దివ్యతత్త్వం నింపుకున్న ప్రాపంచిక క్రియలు
అన్నీ అశాశ్వత నాటకానికి ఆధారాలవుతాయి
ఆ మహత్తు ఎవరిదో, ఏమిటో అతనికి తెలియదు
అది అతీంద్రియమై, అన్నిటా తానే నిండిపోయి
లక్షలోకాలను సృష్టిస్తుంది, అన్నింటినీ నిర్దేశిస్తుంది.
వేల రూపాలను, పేర్లను ధరిస్తుంది, వర్ధిస్తుంది.
అది ఆకాశమంతగా విస్తరించి అంబరం కాగలదు
ఆత్మలో అగుపించనంత సూక్ష్మంగా ఉండిపోగలదు
సుదూర ఔన్నత్యం బ్రహ్మాండాన్ని కనుపించనీయదు.
మార్మిక సాన్నిహిత్యం దాన్ని ఆత్మీయంగా లోపల దాచుకుంది

అది కొన్నిసార్లు కల్పనగా, కొన్నిసార్లు మాయగా తోస్తుంది
మరి కొన్నిసార్లు తానే మహత్తర ఛాయగా మిగులుతుంది.

అది పురోగమనంపై బ్రహ్మాండమైన అనుమానపు నీడ
అన్నిటికి ఆధారమైన మహాశూన్యానికి అవల-
ఆ శూన్యమే అమరమైన ఆత్మశక్తిగా నిలుస్తుంది
అదే అగోచర పరమాత్మవైపు జీవుని ఆకర్షిస్తుంది

కొన్ని రహస్యశక్తులు సహకరించగా, కొన్ని నిరోధించినా,
ఏకైక లక్ష్యంతో సగం మునుగుతూ, నగంలేస్తూ
అవిరామంగా, పట్టుదలతో పురోగమనం సాగించాడు :
అస్పష్టంగా, అగోచరంగానున్న దివ్యత్వం సదా
ప్రసరిల్లుతూ, అగమ్యంగా, పిలుపుకు అందక
పరిమిత వస్తుచయాన్ని శూన్యంగా మార్చుతూ
అతనిని నిర్గుణ నిరాకార స్థితికి చేర్చింది.
ఆపైన ఆరోహణ నిరాటంకంగా కొనసాగింది.

సృష్టించబడినదేదీ జీవించి ఉండని ఔన్నత్యం
అది ఆశలకు, అన్వేషణకు అంతిమరేఖ
ఆపైన దుర్భర కఠోర వాస్తవం చేరువైంది
నిరవధిక పరిణామం పూర్ణంతో సంపూర్ణమైంది
ఆ రేఖ చిగురున మాయ పొరలన్నీ మాయమై
మానవమేధ తేజోమండలాన్ని చేరుతుంది,
లేక, నగ్నసత్యాగ్నిలో శలభంలా కాలిపోతుంది.
అతడు ఏదో ఒకమార్గం ఎన్నుకోవలసిఉంది.
వస్తుతః తనకున్నది, తానుగా సంపాదించుకున్నది
ఇక్కడనే వదలివేయాలి, లేదా, నామరహితమైన
తదాత్మ పదార్థంగా రూపాంతరం చెందాలి.
అది స్వర్గాతీతశక్తితో ఒంటరిగా తలపడుతుంది
ఆలోచనకు కట్టుపడని అతని ఆత్మశక్తి
జడత్వంతో సాహసకార్యానికి దిగుతుంది.

రూపప్రపంచాలను వదలి అతను ముందంజ వేశాడు
విశ్వపరివ్యాప్త ప్రజ్ఞ అక్కడ తారసపడ్డది.
దూరంగా వలయాలుగా మారి దగ్గరకాగా
కర్త అయిన సంకల్పం నిరుపయోగమైంది

సంకేత సజీవ రూపాలేవీ ప్రయోజనకరం కాదు.
అజ్ఞానంతో నిర్మించుకున్న ఆశాసౌధాలన్నీ కూలిపోయాయి.
చివరకు ఈ లోకాన్ని నడిపిస్తున్న శక్తిసైతం
అసంపూర్ణమై తేజస్సులో కరిగిపోయింది.

నిర్మితమైన వస్తుచయం యావత్తు పిగిపోగా
అశాశ్వతమైన ఆధారాలన్నింటినీ అధిగమించి
చివరకు బహ్మాండమైన 'ఆది'లో కలిసిపోయింది.
ప్రత్యేకంగావున్న ఆత్మ 'ఆది'లో లీనం కావాలి,
లేదా వాంఛలకు అతీతంగా 'సత్యం'లో జన్మించాలి.

పైకి కనిపించే ప్రాభవం, సామరస్యం, మధురిమ
అశాశ్వతాలైన ప్రమోదాలుగా తిరస్కరించబడి
ప్రశాంత ప్రవిమల జీవస్థితినుండి బహిష్కరించబడి
మహత్తర బ్రహ్మానందంలో, శూన్యంలో లయించిపోతాయి.
ఉపదేవతలు ధరించిన పేర్లు, రూపాలు నశించి,
వారు శ్రమించి నిర్మించుకున్న లోకాలన్నీ
ఒక్కటొక్కటిగా జీర్ణించి, గతించి పోతాయి.
ఈ లోకం కప్పుకున్న రంగుముసుగు తొలగిపోగా
సృష్టి వైచిత్రిలోని అనూహ్యమైన అంతంలో
యావత్సృష్టికి మూలమైన ఈశ్వరీయత గోచరిస్తుంది
అతని పాదాలు సుస్థిరమైన రెక్కల్ని ధరించాయి,
అతను విశ్వశక్తిని కేంద్రంగా చేసుకున్న ఋషిగా
అంతర్యంలోకి స్వచ్ఛంగా, స్పష్టంగా చూడసాగాడు
అగాధాల ఆకర్షణకు లోనై, అపరిష్కృతంగా

వున్న తరంగాలు తిరిగి నెమ్మది నెమ్మదిగా
అదృశ్య సాగర తలంపైకి చేరుకోసాగాయి.

అతని ప్రతిభావ్యుత్పత్తులన్నీ అక్కడ నిష్ప్రయోజనాలే
విశ్వమేధ గ్రహించ గలదేదీ అతనిలో మిగలలేదు.
శాశ్వతత్వం నిష్క్రమణకు సిద్ధమై, నిర్వేదమై
మహాశూన్యంపైన మరొక శూన్యంగా మారింది
ఆ మహాశూన్యం లోతులలో అంతరించే ముందు
రోదసి స్వప్నంవలె చలించ నారంభించింది.

మరణంలేని జీవాత్మ, పరమాత్మ—రెండూ
అవ్యక్త భూతాలవలె కనిపించసాగాయి
దానినుండే సర్వం సృష్టించబడి, దానిలోనే లయిస్తుంది.
కాని, అది ఏమిటో ఏభావానికి, దృష్టికి అందదు
రూపరహితమైన ఆత్మరూపం ఒక్కటే మిగిలింది
ఎన్నడో ఉన్నదాని సంబంధమైన సశేష ప్రేతం అది.

అగమ్య మహాసాగరంలో మునిగిపోకముందు
కరిగిపోయే తరంగపు చివరి అనుభవం అది,
అది నిశ్చల శూన్యసాగర తీరంపై సుస్థిరమైనట్లు
తాను వెడలివచ్చిన సాగరుని అనుభూతి పొందింది.

ఒకానొకి రోదసినుండి దూరం వేరైనట్లు
ఒకానొక శాశ్వతత్వం నుండి కాలం వేరైన భావన
ఒక నిర్వికార సచ్చిదానంద ప్రశాంతి, తననుండి
విశ్వాన్ని, ఆత్మను నిశ్శబ్దంగా వేరుచేసింది.

నిస్సహాయంగానున్న కఠోర వాస్తవికత కడకు
ఆత్మ చిరంతరాన్వేషణలో సమాధానపడ్డది
నిరామయ, నిర్వికార, నిశ్చలత్వంలో లీనమై
ఎవరూ ఛేదించలేని రహస్యాన్ని దాచుకుని
అతి నిగూఢంగా, గంభీరంగా, ప్రశాంతంగా
అభేద్యంగా, అప్రతిహతంగా సంచరించింది.

దానికి ఈలోకంతో మైత్రీబంధాలు లేవు
దాని హృదయంలో స్పందనకు, కారుణ్యతకు తావులేదు
నిశ్శబ్దంలో ఉదయించిన జీవనసమస్య, పరమాత్మ
ఆమోదం లభించక, పెదవులపైనే లయించింది
విశ్వప్రయత్నాలన్నీ అజ్ఞానానికి లొంగిపోయాయి.
తెలుసుకోదగిన మేధస్సుకు అక్కడ పనిలేదు
అందరూ అనామకంగా నశించిపోవలసిందే
అక్కడ ఎవరికెవరు తోడు రారు, సహచరులు కారు.
దానికి అదే వాస్తవం – అదే అద్వితీయం.
భావన, ప్రేరణ లేని స్వచ్ఛమైన అస్తిత్వం అది
అవిభాజ్య అమల బ్రహ్మానందం నిండిన చైతన్యం అది
అది అనంతత్వంలో తానుగానే ఉంటుంది
అది ఏకైకం, అద్వితీయం, నిర్గుణం, పరిపూర్ణం.
నిరాకారంగా, నిర్గుణంగా, నిశ్చలంగా వున్న జీవం
కాలాతీతమైన 'ఆత్మ' లో తనను గుర్తిస్తుంది
నిశ్చలమైన అంతరంలో అది సృజన రహితం
తాను సృజనాతీతం, సృజనాత్మకమని గుర్తిస్తుంది.
పరమాత్మ ఒక్కటే జీవదాత, అది ఎవరివల్ల జీవించదు
అపరిమితమైన అనంత తేజో రహస్యం
నిర్గుణ బ్రహ్మం కల్పించిన తెరలలో దాగివుంటుంది.
మారుతున్న ఈ జగన్నాటక రంగంపైన
పరమాత్మ అజేయంగా, అప్రమేయంగా నిలిచి ఉంటుంది.
ఆ నిశ్చల పరమార్థం అభేద్యం, అనవద్యం
అది అనంతం, అనశ్వరం, అనూహ్యం, ఏకం.

# ఆరాధన

యోగసమాధిలోనున్న అశ్వపతి ఒక మహత్తర ముహూర్తంలో ప్రపంచాన్ని విస్మరించాడు. ప్రాపంచిక అవరోధాలు, పొరలు ప్రిదిలిపోయి-నేను వేరు అన్న భావం తొలగిపోయింది. తాను వేరుకాదు ఈ మహాసముద్రంలో తానొక జలకణం. అయితే అదేనా అంతం-లక్ష్యం? కాకపోవచ్చు. తన ఆత్మ విశ్వాత్మలో కలిసిపోయింది-అదేనా తాను ఆశించింది? ఆత్మ పరమాత్మలో లీనంకావడమే తన పరమలక్ష్యం కాదు. తాను ఒకవ్యక్తి - మానవతకు తాను ప్రతినిధి ప్రపంచంకోసం, మానవ వికసానికై తాను సాధన చేశాడు. తాను సాధించిన ఫలితాలు తనవిమాత్రమే కారాదు. లోకానికి ఉపకరించాలి. భవిష్యత్తులో మానవాళికి సైతం ఉపయోగపడాలి. ఒక్కవ్యక్తి 'మోక్షం' పొందితే లోకం విముక్తమైనట్లు కాదు - మానవత ముందంజవేసినట్లు కాదు నిర్వాణ సుఖం ఒక్కటే పరమావధి కాదు అశ్వపతి నిర్వాణంతో తన ధర్మాన్ని విస్మరించలేదు. ఆ స్థితిని అతిక్రమించిపోయాడు. మరేదో సాధించాలని ప్రయత్నించాడు.

నిర్వాణస్థితిలో తన ఉనికిని విస్మరించకుండా సాధనచేయగా, దివ్యత్వం అతనిని సమీపించింది. కన్నతల్లిగా అతనిని తన ఒడిలోకి తీసుకున్నది. ఈ ప్రపంచాన్నే జగన్మాత తన గుండెలకు హత్తుకుంది అందరు దేవతలకు మూలమైన జగన్మాత, అన్నిశక్తులకు మూలమైన ఆదిశక్తి - ఆమె దివికి, భువికి మధ్య సంధాన కర్త్రి.

అశ్వపతి తననుండి తాను వేరై, మత్తు వదలి. కొత్తలోకాల తలుపులు తట్టాడు. అప్పుడు మొదటిసారిగా పరిపూర్ణత అనుభవానికి వచ్చింది. ప్రజ్ఞ అనుభూతికి అందింది. ఆ ప్రజ్ఞతో అతను ఉక్కిరిబిక్కిరైనాడు-తలమున్కలైనాడు. పరవశించి పోయాడు. పులకించి పోయాడు-జగన్మాతే సర్వం, సర్వస్వం అనుకున్నాడు. చివరికొసకు చేరుకుంటే తప్ప, అసలు 'అది' ఏదో అర్థం అయ్యేట్లు లేదు. అసలయిన ప్రారంభం అదే అవుతుంది. అందుకే జగ

న్మాతకు 'దాసోహం' అన్నాడు. 'అమ్మ'కు ఆత్మసమర్పణ చేసుకున్నాడు. అప్పుడే అతనిలోకి జగన్మాత ప్రసాదించిన శక్తులన్నీ వచ్చిచేరాయి.

శుద్ధ ఆత్మ పరిశోధనలో జీవునకు
నిగూఢ, నిర్గుణ, నిస్తబ్దత ఎదురవుతుంది,
నిస్తబ్దకుడ్యం, ఆత్మను బాహ్యప్రపంచం నుండి
వేరుచేయగా, నిశ్శబ్ద అఖాతం వివేకాన్ని మింగివేసి
మనస్సు గ్రహించగల మేరకు వాస్తవంగా మార్చి
ఇంద్రియాలు శ్రమించి ప్రోదిచేసుకున్నదంతా
అవాస్తవమని కాల్పనికమని నిరూపిస్తుంది.
ఆధ్యాత్మిక ప్రశాంతి సువిశాల ఆత్మసీమల్ని ఆక్రమించగా
అనూహ్యమైన దంతా వదలివేయబడి
కాలం, దూరంలేని ఈశ్వరీయత మిగులుతుంది.
జీవితావసరాలు దుర్భరాలై తొలగిపోతాయి.
ఆలోచన మనల్ని వదలిపోగా, సుఖదుఃఖాలనుండి విముక్తి లభిస్తుంది.
అహంకారం నశించి అభిమానాలు, ఆత్మీయతలు తొలగిపోతాయి.

ఓ జీవుడా! అప్పుడే ఆనందించకు, ఇంకా వ్యవధివుంది.
నీవు అనంత ప్రశాంత ఆత్మసీమల్ని చేరుకున్నావు
నీవు పరమానందదాయకమైన దివ్య అఖాతాలలో దూకావు
కానీ, నీ స్వీయలక్ష్యాన్ని స్వశక్తిని ఎక్కడ వదిలావు?
ఆ దివ్యమార్గంలో, ఏ మృత్యుతీరంలో వదలినట్లు?
ఆత్మ, ప్రపంచం అయినది ఏదో నీలోనే ఉన్నది
ఈ కాంతి గోళాలమధ్య దానికొరకై నీవు ఏంచేశావు?
బాధ్యతలు విస్మరించడంవల్ల విజయం సిద్ధించదు,
పరలోకాలనుండి నీవు ఏదో పరమలక్ష్యంతో వచ్చావు
ఆ పని పూర్తికాలేదుగానీ, కాలం గడిచిపోతున్నది.
కారణం, భగవంతుని సృష్టి సగమే పూర్తికావడం?

అనంతంగా వస్తున్న 'లేదు' అన్నదే నిన్ను చేరి
నీ కళ్ళలోకి చూచి, నీ హృదయాన్ని చంపివేస్తున్నది,

ఏదీ ఆ ప్రేమమూర్తి 'అవును' అన్న సమాధానం
హృదయంలో రహస్యంగా వున్న అమరత్వం
సృష్టికి మూలమైన సవిత్రుని కీర్తించే పదం
ఓంకారనాదమే సర్వాంగీకార మహామంత్రం
సచ్చిదానందానికి, ప్రశాంతికి మధ్య వారధి
అదే కళ్యాణ సౌందర్యం, నవ వధూ ప్రణయం
బద్ధశత్రువుల్ని సైతం కలిపే మైత్రీమందిరం
విషయ స్వర్ణశిఖరం, రక్షించగల మందహాసం!
జీవన రహస్యంలోని సత్యంకూడ అదే
చీకటి తెర తొలగి పోయినప్పుడు, విశ్వపురుషుని
మహత్తరమైన నీడను మాత్రం మనం చూడగలం
కానీ వెలుగుతెరను తొలగించింది ఎవరు ?
ప్రభువు పూర్ణరూపాన్ని దర్శించింది ఎవరు ?
భగవానుని అవతార లీలలు ఎవరికీ అర్థంకావు
కడపటి అధ్యాయం ముగిసేవరకు అవి అభేద్యాలే
అసంపూర్ణ నాటకసమస్య అపరిష్కృతమే.
జగన్నాటక సూత్రధారి తెరచాటు నుండి నవ్వుతుంటాడు
ఆ దివ్యరూపాన్ని మానవుడు దర్శించ గలగటంలో
ఆ పావన మూర్తి హిరణ్యరూపావిష్కరణంలో
అపరిష్కృత దివ్యరహస్యం దాగివుంది
ఒక బృహత్తరమైన కాంతిరేఖ గమ్యంగా కనిపిస్తుంది
ఆపైన ఎక్కడో అదృశ్యంగా తేజోమండలాలు ఉంటాయి.
అదిగో, అంతంగా కనిపిస్తుంది ఒక సువిశాల ద్వారం
అదే దివ్యత్వ ప్రవేశానికి కడపటి ప్రస్థానం.
కాల రాహిత్యంపైన దృష్టి సోకినప్పుడు, పరమాత్మ
తాను ప్రసాదించిన రూపాలను వెనక్కు తీసుకుంటుంది
అంధకారం నుండి, వెలుగుసీమల నుండి నిష్క్రమించిన
సహస్ర కిరణాలు తిరిగి భాస్కరుని చేరుకుంటాయి.
అప్పుడు పరమాత్మ శూన్యస్థితి మిగులుతుంది

ప్రకృతి అనాచ్ఛాదియై, భగవంతుని సైతం కప్పివేయదు.
ఆ మహత్తర శూన్యస్థితిలో సర్వం ఉంటుంది
మనల్ని క్రమ్మిన బలమైన తెరలు చిరిగిపోయినపుడు
ఆత్మను క్రమ్మిన అజ్ఞానం నశిస్తుంది-ఆత్మ నశించదు
ఆ శూన్యస్థితి అమరత్వాన్ని సైతం దాచి ఉంచుతుంది
ఆ మహత్తర అంధకార శూన్యమే సర్వస్వం కాదు
సర్వ వినాశం భగవంతుని కడపటి లక్ష్యమూ కాదు
అది జీవిత పరమసత్యం, జీవుని చరమగమ్యం
ఈ విచిత్ర విశ్వానికి 'లయం' పరమార్థంకాదు.
నిర్వికార నిశ్శబ్దంలో నిర్గుణశక్తి నిద్రాణమై వుంది
అది జాగృతమై యోగనిద్రలో నున్న ఆత్మను మేల్కొల్పి
ఒక్క కిరణంతో మూలజ్యోతిని వెలిగిస్తుంది
అది ప్రపంచాన్నే ఆత్మశక్తికి ఆలంబనం చేయగలదు
అదే మంటిలో పరమాత్మ రూపాన్ని దిద్దగలదు
ఒక్క అడుగు ముందుకు వేస్తే 'ఆత్మ' స్వతంత్రమవుతుంది
ఇక్కడ భగవంతుని ఆశయం, ఆత్మసిద్ధి ఒక్కటే.
అతడు జీవన నగ్నతీరంపై నిలిచినప్పుడు
అతని ఆత్మాన్వేషణ, ఆరాటం అన్నీ
ఏదో నిరామయ శూన్యంలో లయించిపోగా
అతను అన్వేషిస్తున్న దివ్యత్వం సమీపించింది.
అది పరమ ప్రశాంత నిశ్శబ్దస్థితిని చీల్చుకుని
అద్భుతమైన అతీంద్రియ కేంద్రం నుండి
ఒకానొక నిరాకార, నిర్గుణ, సచ్చిదానందంగా
ఒక మహాద్భుత తేజశ్శరీరంగా రూపుదాల్చి
మధుర మంజులమైన మార్మిక రూపంగా
ఆది అయిన బ్రహ్మానందస్థితికి చేరుకున్నట్లు
అనంతం నుండి, నిర్గుణంవలె వెలువడ్డది.
మాతృమూర్తి బిడ్డను అక్కున చేర్చుకున్నట్లు
ప్రజ్ఞాప్రాభవ పరమానంద దాయిని అయిన ఆమె

ప్రకృతిని, ప్రపంచాన్ని, ఆత్మను హృదయానికి హత్తుకుంది.
గంభీరంగా, నిర్మాల్యంగా వున్న శూన్యాన్ని రద్దు పరచి
నిశ్శబ్దంగా, నిరుపయోగంగా వున్న మౌనాన్ని ఛేదించి
నిరవధికంగా నున్న నిర్గుణంలోకి చొచ్చుకుని,
హృదయంలో లోతులకు స్వతంత్రంగా పోగా,
ఒకానొక సుందర తేజస్సు సాక్షాత్కరించింది
ఆ తేజస్సు ఓజస్సై, ఒక అద్భుత కిరణమై
అతనిలోని చిరకాల ఉద్దీపనల్ని రగిల్చి
అతని హృదయంలో బంగారు బాటలు పరచింది.
ఆ పూర్ణ సౌందర్యం వల్ల కలిగే మధుర క్షణాలు
సృష్టి చక్రంలో ఏర్పడే అహంకారాన్ని రద్దుచేశాయి.
హృదయం దివ్యపూర్ణమైనప్పుడు కలిగే ప్రకృతి స్పందన
జడప్రపంచంపై పల్లెడలా కనిపిస్తుంది.
అది ప్రాణాన్నే ఆనందమయ రహస్యంగా మార్చి
బాధలు, ఆనందాలు భరించే ప్రేమను అందిస్తుంది
బాధల్ని ఆనందంగా మార్చగలిగిన ప్రేమ
ప్రపంచంలోని విషాదాన్ని నిర్మూలించగలదు
భగవదనుగ్రహం ఎంతగోప్యంగా ఏర్పడినా
అనంతమైన కాలభారాన్ని ఆనందంగా భరించవచ్చు.
బ్రహ్మానందస్థితి జీవితంలో నిగూఢంగా నెలకొని
జీవుని అద్భుతమార్గంలో నడిపిస్తుంది
అనునిత్యం అమరమైన విలువల్ని అన్వయిస్తూ
గ్రహాల పరిశ్రమకు న్యాయం చేకూర్చుతుంది.
భగవంతుని వెనుక పరబ్రహ్మ ఉన్నాడు
జగన్మాత శక్తి విశ్వమంతా వ్యాపిస్తుంది
దేనిని కాదనక, ఉన్నదానినంతా ఆక్రమించి
సర్వత్ర చైతన్యం తన ప్రభావాన్ని చూపుతుంది
అనిత్యమైన మన జీవితాలపై, అనశ్వరమైన
బ్రహ్మానందాన్ని, అఖండశక్తిని పొందగలిగాడు.

సర్వజగత్తును సృష్టించి, లయింపచేసే
సమ్మోహన శక్తిగా అనంతసత్యం ఇక్కడ భాసిస్తుంది
అన్ని లౌకిక, పారలౌకిక శక్తులకు మూలమైన
జగన్మాత మధ్యవర్తిగా, భూమిని బ్రహ్మంతో కలుపుతుంది
మన అంధప్రవృత్తిని శాసించే చిక్కు విడిపోయి
అజ్ఞానపు పైపొర తొలగి, ప్రిదిలిపోతుంది
మరహంకారం వల్ల ఏర్పడిన మనోవైకల్యాలు
విషయలోలత్వంతో చేసే తప్పులు తొలగిపోతాయి

జగన్మాత సర్వదర్శన ప్రజ్ఞాప్రాభవాల వల్ల
జ్ఞానాజ్ఞానాలు ఏవీ స్థిరంగా ఉండవు.
విశ్వయంత్రంలోని విభిన్న ధృవాలు,
భయంకర ప్రతికూలశక్తులు, జగన్మాతకు
మనకు మధ్యన తమ రూపాల్ని వదలి,
రెండూ బలమైన తెరలనే భ్రమల్ని కల్పిస్తాయి.
స్వయంకృతాలలోనే దాగిన ప్రజ్ఞ చేరువైంది
ఈ అంధకారవిశ్వమే అది కప్పుకున్న ముసుగు.
సృష్టిలో ఏదీ లక్ష్యరహితం అనిపించదు
నశించిపోవడమన్నది ఏకైక విముక్తి కాదు.

చిరకాలంగా అన్వేషిస్తున్న గుప్తమార్గం కనుపించి
మన జీవుని జన్మరహస్యం బహిర్గతమైంది
భౌతికవిషయ విమూఢత్వంలో, అశాశ్వతము
అసమగ్రము అయిన శరీరంగా మనస్సుగా మారింది.
సువిశాల ప్రశాంతసీమలలో హృదయం స్పందించి
నిర్మల ఆధ్యాత్మిక సరోవరాల రగిలిన ప్రేమాగ్ని
అజ్ఞానంవల్ల కలిగే విషాదాన్ని తొలగించింది.
జగన్మాత అమల దరహాసంలో వేదన అంతరించింది.

దివ్యజీవనం ఇక్కడ మృత్యువును జయిస్తుంది
ఆ తర్వాత మనస్సు తప్పుచేయడం సాధారణంగా జరగదు

అంతా ప్రేమమయం, త్యాగపూర్ణం అయినప్పుడు తప్పు జరుగదు
రూపం, అరూపం రెండు జగన్మాతలో కలిసిపోతాయి
ఒక్క దివ్యవీక్షణంవల్ల బ్రహ్మానందం లభిస్తుంది
ఒక్క దివ్యదర్శనంవల్ల అమరత్వం చేతికందుతుంది.
అంధకార ప్రాపంచిక శక్తులు ఆకాంక్షించే ఆనందాలు
ఆమెలో అపాదమస్తకం అవిష్కృతమైనాయి.
ఆమె సుందర శరీరం బ్రహ్మానంద జ్యోత్స్నా సాగరం
ఆమె జన్మకు, విధికి, పరిశ్రమకు అతీతురాలు-
అవి కాలచక్రంలో తిరుగుతూ ఆమె కోరినప్పుడు నిలిచిపోతాయి.
కాల రక్కసిని ఆమె మాత్రమే సమూలంగా కబళించగలదు.

నిశీధం తనలోనే దాచుకున్న రహస్యం ఆమెది
జీవాత్మ ప్రదర్శించే తాంత్రికశక్తులన్నీ ఆమెవే
తానే సువర్ణవారధి, తానే అద్భుతమైన అగ్ని
అగోచర తేజోపూర్ణ హృదయమే ఆమె
భగవానుని నిశ్శబ్ద అంతర్య శక్తి ఆమె
ఆ జగన్మాతే మహాశక్తి, జగన్మాతే శబ్దశక్తి
మన కఠోర పురోగమనానికి అత్యంత ఆకర్షణ ఆమె
మనలో చిరుదీపాలను వెలిగించే దివ్యజ్యోతి ఆమె
అదృశ్యలోకాల నుండి ప్రసరించే ఆనందకిరణం ఆమె.
ఆ మహాశక్తులేవీ మున్నెన్నడూ ఆవిష్కరించబడలేదు

బ్రతుకు బాధల్ని ఆమె పాదస్పర్శతో తొలగించమని
మానవుని ఆత్మను బంధించిన కవాటాలను భేదించమని
మూతపడిన హృదయాలలో జ్యోతుల్ని వెలిగించమని
సర్వప్రకృతి ముక్తకంఠంతో ఆమెనే ప్రార్థిస్తుంది:
ఒకనాటికి లోకమంతా ఆమె దివ్యమందిరం కావాలి.
అన్ని వైరుధ్యాలు ఆమె అనురాగంలో కరిగిపోవాలి
మన మమతలు, ప్రజ్ఞలు ఆమెకే కైంకర్యం కావాలి.
ఆమె ఉజ్జ్వల పారవశ్యంలోనే మనం జీవించాలి

ఆమె స్పర్శ మన వేదనల్ని ఆనందాలుగా మార్చాలి.
ఆమెవల్లనే మన ఆత్మలన్నీ ఏకం కావాలి——.

ఆమెలోని పరిణామం ఆమెలోనే సుస్థిరం కావాలి.
మన జీవితం ఆమె పూర్ణానుగ్రహానికి లోనుకావాలి
పైన, నిరవధిక సుప్రశాంత ఆనందమయ సీమలు
దిగువన, దివ్యసంస్పర్శనంవల్ల కలిగే పారవశ్యం.

భగవదనుగ్రహం ఒక మెరుపులా కలిగినపుడు
ఆపాదమస్తకం ఆనందపారవశ్యంతో నిండిపోతుంది.
ఇంద్రియాలు ఆశ్చర్యంతో ఉక్కిరిబిక్కిరవుతాయి.
అతని ఆత్మ జగన్మాత దుర్భరాగ్నిలో చిక్కుకుంది——.

ఒకసారి చూచిన హృదయం తర్వాత ఆమెనే వాంఛిస్తుంది.
అనంత బ్రహ్మానందతృష్ణ ఎంతకీ చల్లారదు
ఆమె దర్శనంతో అన్నివాంఛలు నశించి, ఆమెలో కనిపిస్తాయి
అతని ప్రయత్నాలన్నీ ఏకోన్ముఖమై, లక్ష్యాన్ని ఆశించాయి.

అలా, అనంతకాలంలో ఒక బీజం ఏర్పడ్డది
ఒక వెలుగు కనుపించింది, ఒక శబ్దం వినిపించింది
ఒక్క క్షణంలో యుగయుగాల పరిశ్రమ వ్యక్తమైంది.
కాలరాహిత్యంనుండి లోకాలు మెరపుల్లా వెలువడ్డాయి
ఒక్క స్థిరసంఘటనతో సంవత్సరాలు గడిచిపోయాయి.
అతను చేసిన పని, రంగాన్ని సిద్ధపరచడమే
ఆ స్వల్ప ఆరంభమే మహత్తర ఫలితాన్ని ఆశించింది.

ఆమె ఆనందం తనలో రూపు దిద్దుకొనడానికి
తన జీవన మందిరంలో ఆమె సౌందర్యం, ఔన్నత్యం
కొలువు తీరడానికి అతను తనను తాను పునర్నిర్మించుకోవాలి
ఇప్పుడు అతని జీవస్థితి ఆత్మకన్న విశాలం
అతని హృదయ వాంఛలు విపరీతంగా పెరిగాయి

ఆతనికి తన ఒక్కనికి స్వాతంత్ర్యంతో తృప్తిలేదు
ఆమె తేజస్సు, అనుగ్రహం, బ్రహ్మానందం, సమస్త
మానవాళికి, ప్రపంచానికి అందాలని అతని ఆకాంక్ష.

కానీ అజ్ఞానం, మృత్యువు అనే భౌతిక తెరల్ని
మానవప్రేమ, మానవశక్తి ఛేదించలేవు.
మనిషి సామర్థ్యం పసివాని పట్టుదల వంటిది
చాచిన చేతులకు అందనంత ఎత్తునవుంటుంది స్వర్గం.
ఆలోచనవల్ల, ఆవేదనవల్ల తేజస్సు చేతికందదు.
ప్రశాంత మనస్సు, అతీంద్రియస్థితి ఏర్పడినప్పుడు
హృదయం నిశ్శబ్దంలో అవ్యక్తనాదాన్ని వినగలుగుతుంది.
అందుకు సంపూర్ణ సమర్పణ ఒక్కటే ఏకైక మార్గం.

ఊర్ధ్వలోకాలలో వుండే ఒక దివ్యశక్తి కదలి
మూతపడివున్న జీవనప్రాంగణంలోకి దివ్యత్వాన్ని
తెచ్చి, అశాశ్వతమైన జీవితంలో అమృతం నింపాలి.
ప్రతిఘటించే శక్తులన్నింటినీ చీల్చి, నరికివేయాలి.
ఏ పరమప్రయోజనంకొరకు మన జీవితాలు ఏర్పడ్డవో
ఆ పరమాత్మకోసం ఇహ సుఖాలను మనం త్యాగం చేయాలి.

ఇప్పుడు అతని ఇతర వాంఛలన్నీ తొలగిపోయాయి
జగన్మాత శక్తిని, రూపాన్ని, తన హృదయంలో
మనస్సులో, ప్రాణంలో ప్రతిష్ఠించుకొన ప్రయత్నించాడు
ఆ జగన్మాతను దివినుండి భువికి రప్పించాలని,
ఆమె ప్రేమను, సత్యాన్ని, ఆనందాన్ని
అంధకార వేదనా జగతికి అందించాలని
ఆ దివ్య స్పర్శనంతో లోకాన్ని సముద్ధరించాలని ఆశించాడు
అతని ఆత్మవిముక్తమై, ఆమెకే అంకితమైంది.

# జీవుని ఆవాసం - నవ్యసృష్టి

ఈ ప్రపంచం పూర్తిగా మారిపోవాలంటే నవ్యసృష్టి జరగాలి. అందుకై అశ్వపతి ఆత్మనిగ్రహంతో, నిశ్చలంగా తపస్సు చేయసాగాడు. ఎంత తీవ్రంగా తపస్సు చేసినా, అతను ప్రపంచ ప్రజ్ఞను కోల్పోవడం లేదు. ప్రాపంచిక సంబంధాలు తెగిపోవడంలేదు. అవిద్య, అజ్ఞానం తనను వదలడం లేదు. నిజానికి అజ్ఞానమూ అనంతమేగదా! దానిని గర్హించినా అధిగమించడం అసాధ్యం. కనుక దానినుండి తప్పించుకొనకుండా దానిని పూర్తిగా జయించాడు. స్వాధీనం చేసుకున్నాడు. దేనినీ కాదనకుండా, జీవితాన్ని సమన్వయ పరచుకోసాగాడు - అదే సుగమ మార్గం అనిపించింది. అదే తన గమ్యం అని తోచింది.

ఆత్మ విద్యతో విశ్వవిజ్ఞానం బోధపడసాగింది అప్పుడు అల్పం, అనంతంగా మారసాగింది. అతనిలో ఇప్పుడు విశ్వ కామనలు, విశ్వ యాతనలు గూడుకట్టుకున్నాయి. ఇప్పుడు తానే కర్త, తానే సాక్షి. సాధనవల్ల, సమాధి స్థితిని చేరుకొని, ఉన్నత గతుల్ని పొందగలిగాడు: అతనికి కొత్త శక్తి చేకూరింది. కొత్త ఉత్సాహం ఏర్పడ్డది. దివ్యదృష్టి ఏర్పడ్డది. త్రికాలజ్ఞత అలవడింది.

ఈ ప్రపంచం మారుతుందని జ్ఞానదృష్టితో తెలుసుకోగలిగాడు. మారే ప్రపంచాన్ని దివ్యదృష్టితో దర్శించాడు. అక్కడ ఎన్ని కాంతి మండలాలు! ఎన్ని క్రాంతి గోళాలు! అవి ఇతః పూర్వంలేనివి, కనిపించనివి. అది పూర్ణ విశ్వం. పదార్థం - ఆత్మ కలిసి పోయినప్పుడు, ఏకం అయినప్పుడు కలిగే పరిణామం అది.

ఎన్నెన్నో బాధల్ని భరించాడు. అవరోధాన్ని అతిక్రమించాడు. బాధా తప్త లోకాలను గమించాడు, ఇప్పుడు తనలోనే, తనవి అయిన రెండు రూపాలు, రెండు శరీరాలు- తానిప్పుడు సర్వ స్వతంత్రుడైన జీవుడు - మరొక విధంగా, అస్వతంత్రుడైన ప్రాపంచిక జీవి. ఊర్ధ్వలోకాల ఔన్నత్యాలకు తానే సాక్షి.

ఇహ లోకంలోని బాధలలో యాతనలలో భాగస్తుడు: ఎన్ని విరుద్ధ శక్తులు, ఎన్నెన్ని ప్రతిఘటనలు... అన్నింటినీ కాదని, అన్నింటిని దాటి, పరమాత్మను శరణుచొచ్చాడు. 'సర్వం ఖల్విదం బ్రహ్మ' అనుకున్నాడు. అలా అనుకో గలిగినప్పుడే అదిగో, జగన్మాత అడుగుల సవ్వడి వినిపించ సాగింది. ఆమె పదనిక్వాణాలు వినగలిగాడు...

అతను చేసినదానికన్న చేయవలసినదే మహత్కార్యం!
అందుకు మిగతా జీవరాశిని వదలి తాను సిద్ధపడ్డాడు.
అవగాహనకు అందక, ఆలోచనవెనుక ఉండి
రహస్యంగా సత్యాన్ని తెలుసుకునే ఒక సంకేతం
తన విశ్వవీక్షణ చాతుర్యంతో లోకాన్ని రక్షిస్తుంది.

చొరవీలులేని ఆత్మ నిశ్చల స్థితిలో
మూర్తీభవించిన లక్ష్యంగా, ప్రశాంతంగా
పద్మాసన స్థితిలో, భగవద్ధ్యానంలో, సుస్థిరంగా
అతను ఏకాంతంగా, ఏకాగ్రంగా కూర్చున్నాడు.
అంతవరకు పృధ్విపై లేని శక్తిని అతను ఆశించాడు
మానవ ఇచ్ఛకు అతీతమైన దివ్య సహాయం అర్థించాడు
అప్పటికి సుదూరంగా కన్పించే సత్య వర్చస్సుకై
అన్నింటికీ ఆది అయిన మహాశక్తి ఆమోదం అర్థించాడు.

కాని మహోన్నత శిఖరాలనుండి అందుకు సమాధానం లేదు
మూతపడివున్న కాలం కనురెప్పలు తెరుచుకోలేదు
సంవత్సరాలు నిష్ప్రయోజనంగా గడచిపోసాగాయి
మన మానవతత్వం రూపొందిన పద్ధతిలోనే
బ్రహ్మాండమైన నిరోధం అతనికి మూగగా ఏర్పడ్డది.
మనకు కనిపించని అజ్ఞానం ఆధారంగా
జీవుని ఆంతర్యంలో అవరోధం ఏర్పడ్డది.
విషయాలకు మూలంలోనే వ్యతిరిక్తత ఏర్పడ్డది
చీకటిలో రహస్యంగా చేతులు కలపడం
అతని నైజంలోనే వున్నది కాని బహిర్గతం కాలేదు.

అప్పటికి అతని భౌతిక జీవనంలో కొంతమేర
జన్మస్థావరమైన అంధత్వంతో సంబంధం ఉంచుకుంది.
కరిగిపోయిన గతంలోని ఐకమత్యం నీడగా
ప్రాచీన ప్రపంచ నిర్మాణంలో భద్రంగా మిగిలింది.
అవి గోప్యంగా వివేకానికి, ప్రజ్ఞకు అందక
మనస్సు, ఆత్మ కోరినప్పుడు మాత్రం మందంగా,
మధుర జ్ఞాపకాలలో కలలవలె కదులుతుంటాయి.

చేజారిన గింజల్లా రాక్షస ప్రవృత్తులు విస్తరించి
చేరువవుతున్న సత్యాన్ని భయపెట్టి రాకుండా చేస్తాయి
సంప్రదాయాలు, ఆదర్శాలు, నిరర్థకంగా తిరుగుతూ
స్వర్గమేదో భూమిపైకి దిగివచ్చి, లోకంలోని
అసమగ్రతల్ని, మానవ నైజంలోని మధురమైన
బలహీనతల్ని పూరించి, సరిదిద్దాలని ఆశిస్తాయి.

ఇప్పుడు అతను పరమాత్మను కాదని, తనలో తానుగా
ఆ ప్రజ్ఞను ప్రతిష్ఠించుకోవాలని ప్రయత్నించాడు.
అందుకై ప్రకృతిలోని మూల మూలల్ని గాలించిశోధించి
వెలుగున ప్రకృతి రహస్యాలనన్నీ పరిశీలించగా
సర్వాన్ని శుద్ధి చేయగల పవిత్ర తేజస్సుకు
దూరంగా, చీకటి మందిరాలలో ఆశ్రయం పొందిన
ప్రతికూల శక్తులు, అరూప ప్రతిఘటనలు కనిపించాయి.
దివ్యం కాని దంతా నశించి పోయినట్లే కనిపించింది
కాని ప్రతికూల శక్తులలో ఏ కొద్దిగనో తప్పించుకోగా
అంధ శక్తులకు అది కేంద్ర బిందువు అయింది.
నిజానికి అజ్ఞానం సైతం అనంతమే !

దాని లోతుల్ని మరింతగా తరచి శోధించినకొద్దీ
అవి మరింతగా విస్తరించి, అనంతంగా సాగిపోతాయి.
మానవ వాంఛ సత్యాన్ని మలిన పరచకుండా,
అతను తన వాంఛల్ని సమూలంగా పెరికివేసి

శూన్య హృదయాన్ని దేవతలకు సమర్పించాడు,
అలా అతను పాప రహితుడైనాడు.
చివరిదైన మహత్తర పరిణామం ఏర్పడ్డది.

అతని ఆత్మ మహాసాగర తలం వలె నిండిపోయి
మనస్సును, శరీరాన్ని తరంగాలతో ముంచివేసింది.
సమస్త విశ్వాన్ని ఆక్రమించాలన్న లక్ష్యంతో ఆత్మ
విస్తరించి, ఇటు అంతరాన్ని, అటు బాహ్యాన్ని ఏకం చేసి
జీవితాన్ని విశ్వ ప్రేమతో నింపివేయాలని
సుస్థిర దివ్య సామ్రాజ్యంగా మార్చాలని యత్నించింది.

ఈ అద్భుతమైన విశ్వ జనీనతలో
అతని ఆత్మ స్వభావం, మానసిక నైజమేకాక
అతనికి చెందిన సర్వమేధ, సర్వాత్మ
చివరకు శరీరంలోని ప్రతి అణువు మారిపోయాయి.
జీవించి వున్న ప్రతి జీవి తానే కాగలిగింది
ఇతరుల ఆనందమే తన ఆనందంగా భావించి
ఇతరుల విషాదాలు తనవిగా అనుభవించాడు
సకల జీవుల కర్మఫలాన్ని పృధ్వి భరిస్తున్నట్లు
సాగరంవలె గంభీరంగా ఉంటూ, అతని
విశ్వ కారుణ్యం సృష్టి భారాన్ని వహించింది.

గుప్తంగా వున్న అతీంద్రియ సుఖశాంతులకు పరవశించాడు.
ఆపైన అనంతంగా సాగే స్వ పర భేదం ఉండదు.
నిగూఢ ఆత్మ సంధానంలో జీవుడు ఏకమైనప్పుడు
స్వభావం, ఏకైక సచ్చిదానందమే అవుతుంది.
ఆత్మకు ఆత్మకు మధ్య భేద భావం ఉండదు
ప్రపంచానికి పరమాత్మకు మధ్య అవరోధం ఉండదు.
స్మృతుల్ని, రూపాల్ని పరిమితం చేసే రేఖల్ని దాటిపోగా
మానసిక నియమాలు కకావికలై పోతాయి
అవి అన్నీ కరిగిపోయిన తర్వాత ఏమీ మిగలదు

లోకాల్ని సృజించే ఏకైక చైతన్యం మిగులుతుంది
ఇప్పుడు అది అంతా విస్తృత తేజస్సు, అపారశక్తి.

మానసిక విస్మృతి తొలిసారిగా కలిగినప్పుడే
ఆత్మకు స్వార్థ పరత్వం నశించి పోతుంది
నేను వేరన్న ప్రత్యేకభావం కలగనే కలగదు
అది అంతర్ధానమై, తాను అన్నది ఏమీ మిగలక
ఆధ్యాత్మిక విశాల జగత్తులో లీనమై పోతుంది.

అతని స్వభావం సర్వజీవుల చలనంగా మారి
అంతా 'పరమాత్మ' అన్న గుర్తింపు కలిగింది
అతని ఆత్మ సర్వజీవులకు ప్రతినిధి అయి,
తనసుండి వేరై పరమాత్మను చేరే ప్రయత్నం చేసింది.

మానవ లక్ష్యమే సంపూర్ణంగా మారిపోయింది
పరమాత్మను గుప్తంగా దాచుకున్న మానవ హృదయం
తనలోనే దైవశక్తి స్పందనను గమనించింది
సత్యాన్ని గుర్తించడంతో మానవమేధ పరిశోధన ఆగిపోయింది.

విశ్వజీవ ప్రవాహంలో అతని జీవం కలిసిపోయింది
అప్పుడు విశ్వ శిఖరాగ్రాన సంతృప్తిగా నిలిచి
ఈ లోకాన్ని దాటి పైకి పోవడానికై చూడసాగాడు
దివ్యత్వం దిగివచ్చి లోకాన్ని ఉద్ధరించాలని ఆశించాడు.

ఒక మహత్తు, ఒక సంకేతం భూమిని ఆక్రమించగా
శూన్య తలాలన్నీ మాధుర్య పూర్ణాలయినాయి
సుదూరాన ఉన్న వెలుగులు సన్నిహితాలైనాయి
కడు దూరం అనుకున్న దివ్యలోకాలు చేరువైనాయి.

ఆ మహాద్భుత తేజస్సుకు ఇంద్రియాలు పనిచేయవు
అతని చెవులకు ప్రాపంచిక శబ్దాలు వినిపించలేదు
ఏ దివ్యభావన నిరుపయోగంగా నశించిపోదు
భగవంతుడు అలసిపోయి మార్మిక జలాల కరిగిపోయాడు.

అతని జ్ఞానం శుద్ధ నిర్గుణ దృష్టికి అంకితమైంది
ప్రాపంచికమైన ఆలోచనలన్నీ నశించిపోసాగాయి

విధి ప్రభావం, ప్రకృతి నైజం నశించిపోయాయి
విశ్వ సమ్మోహనమైన ఆ నిశ్చల ప్రశాంతిలో
స్వ – ఇచ్ఛా సంకల్పాల వేడి నిట్టూర్పులు పమసిపోయాయి.

అతని ప్రతి అవయవం నిస్తబ్దమై, జడమై,
నగ్నంగా, నిరాటంకంగా, నిర్భయంగా
పరమాత్మను భరించి, స్వీకరించడానికి సిద్ధమైంది
చివరి చలనం సైతం ఆగి, ఒక్కసారిగా సర్వం స్తంభించింది.

అదృశ్యంగా నున్న పరమాత్మహస్తం బరువుగా
అతని అవయవాలపై ఆధ్యాత్మిక ముద్రవేసింది
దివ్యత్వమే అతనిని మహాసమాధిలోకి చేర్చింది

మార్మిక తీరాలను చేరడానికి ఉద్యమించిన నావికునివలె
పరమాత్మే ఊపిరిగా మహాసాగరాలను దాటుకుంటూ
క్రిందనున్న అనంత అగాధాలను, చుట్టూవున్న అగోచరాలను
పైనవున్న నక్షత్ర మండలాన్ని, రోదసిని అతని ఆత్మ దాటిపోయింది.

ప్రాపంచిక పరిమితశక్తు లన్నింటికి అతీతంగా
నిగూఢమైన మూల శక్తులలోకి పరుగుతీసింది
మానసికోపరితలం నుండి ప్రశాంత వాతావరణానికి
లోలోపల నిశ్శబ్దంగా పరివ్యాప్తమైన నిద్రలోకి జారింది.

అసంపూర్ణ భావాలకు, శబ్దాలకు అతీతంగా
దృష్టి పథాన్ని, చివరిదైన ఆధార రూపాన్ని దాటి
మహత్తర తేజోమండలాలలో కలిసిపోతాడు.
లేక, నిర్గుణ నిశ్శబ్దమైన శూన్యంలో పయనిస్తూ
పథరహితమైన శుద్ధ చైతన్యంలో ఒంటరి అవుతాడు.
లేక, ఆత్మ, అనాత్మ, ఆత్మ రహిత స్థితుల్ని అధిగమించి
మానసిక చైతన్య స్వప్న తీరాలను సైతం దాటి
ఆద్యంత రహితమైన మూలస్థితిని చేరుకుంటాడు.

ఆ నిరాకార శిఖరాలపై శబ్ద అవరోధం ఉండదు
భౌతిక ప్రపంచానికి దూరంగా, అతి నిర్మలంగా

ఆధ్యాత్మిక వాతావరణం ప్రశాంతంగా నెలకొన్నది.
అక్కడ దేనికీ ఆదిలేదు, దేనికీ అంతం ఉండదు,
చలనమున్న ప్రతి వస్తువుకు నికరమైన శక్తి ఉంటుంది
సృష్టికి మూలమైన కృణువు అచలంగా ఉంటుంది.
అక్కడి శూన్యంలో సృష్టికి మూలమేదో తెలియదు
సృష్టి మహాయంత్రాన్ని ఆత్మ గమనించదు.
విధి నడిపించే యాంత్రిక ఘోషలు అక్కడ వినిపించవు
ఒకే గుండెలో మంచిచెడులు కలసి కాపురముంటాయి.
ప్రేమానుబంధంలోనే ప్రతికూల ఘర్షణ
జీవితం జరిపే ప్రయోగాలలో భయంకర వేదన
అందివచ్చే అవకాశాలవల్ల మారే విలువలు
మానసిక ప్రలోభంలో మన జీవితాలను
వివిధ దేవతలకు పణంగా సమర్పిస్తాం.
ఆలోచనలు చీకటివెలుగులవలె మారుతూ
బాహ్యచైతన్యం పైన ముసురు తుంటాయి
నిశ్చలంగా వున్న స్వాప్నికస్థితిలో ఆత్మకు
లోకం సగమే కనిపిస్తున్న భ్రాంతి ఏర్పడుతుంది.

అక్కడ అజ్ఞానం సాధించేదంతా వివేకమే
జీవితంలో సాధించేవన్నీ నిష్ప్రయోజనాలే
అప్రయత్నంగా, అనూహ్యంగా జరిగే విధానంలో
అనిశ్చల, నిశ్చైతన్య సీమలలో వాటికి
ప్రవేశం ఉండదు, లక్ష్యంఉండదు, జీవించే హక్కుఉండదు
నిశ్చలమైన ఆత్మశక్తి మాత్రమే అక్కడ విస్తరించి
అనంత నిశ్శబ్దంలో ఒంటరిగా విహరిస్తుంది.
అదే సర్వ వ్యాపక, సర్వశక్తిమయ ప్రశాంతి.

ఆలోచన ఆలోచనతో, సత్యం సత్యంతో కలహించవు
ఒక న్యాయం మరొకన్యాయంతో యుద్ధానికి దిగదు.

ఒక అవకాశం వదలి మరొక అవకాశం కొరకు
అంగలార్చే అరకొర జీవులకు అచ్చట స్థానంలేదు
జడంగా, తేజో రహితంగా వున్న శరీరాలలో
హృదయస్పందనలు బలాత్కారంగా ఏర్పడవు

నిరంతరం రగిలే యోగాగ్నుల సహాయంతో
ఆ జగన్మాత మహత్తర మందిరంలో
చిరంతనమైన సత్యమే నిత్యమైన వేదికగా
పరమాత్మ ధర్మాన్ని రక్షిస్తున్న వారున్నారు.

ప్రకృతి తన మూగ ఆధ్యాత్మికతపై ఆధారపడి
తన పరిణామ శీలతను గురిస్తూనే ఉంటుంది
అసంఖ్యాక లోకాలలో కలిగే సంచలనానికి
నిర్వికారంగా, ప్రశాంతంగా తన ఆమోదాన్ని అందిస్తుంది.
సర్వము తానై, సర్వసృష్టికి తానై, సృష్టికి తాను అతీతమై
పరమాత్మ సర్వం, నిశ్చలంగా గమనిస్తూ ఉంటాడు.
ఒకే ఒక్క జ్ఞాననేత్రం సర్వసృష్టిని పరిశీలిస్తుంది.

ఈ సృష్టి కలరవానికి అతీతమైన నిశ్శబ్దంలో
అతను అనంత ప్రశాంతిలో లీనమై పోయాడు
అంతు దరి లేని ఆత్మ అతనికి ఆవాసమైంది
అతని పరిపూర్ణ ప్రజ్ఞ ఒక్కటే అతనికి సహాయం.

ఆలోచనకు కట్టుపడని ఒక మహామేధ
శూన్యంలో విహరించడానికి ఆటంకంలేని జీవం
కాలానికి లోబడి, కట్టుపడని నిరవధిక ఆత్మ
చిరకాల విశ్వయాతన సమసిపోవడం గుర్తించాడు
తానే జనన మరణాలకు అతీతమైన ఆత్మగా మారాడు
పరమాత్మ సామ్రాజ్యంలో తాను ఒక్కడై నాడు.

ప్రశాంత రోదసిలో ప్రాయికమైన ఒంటరితనం ఆవరించింది
కాలానికి కట్టుపడివున్న వాటితో దానికి సంబంధంలేదు

ప్రకృతిలో విశాల విశ్వం యావత్తు శూన్యమే అయింది.
సమస్త వస్తుజాలం తొలి అరూప స్థితికి చేరుకుంది.

ఒక కాలచక్ర పరిభ్రమణంలో లోకం నిశ్శబ్దమైంది
తాను కలుషితమైన ప్రకృతిని దాటి పోయినా
ప్రకృతి ముద్రలు అతనిలో అనేకం మిగిలే ఉన్నాయి.
నిర్జీవ స్వప్నం క్రమక్రమంగా కరిగిపోయినట్లు
బృహత్తరమైన ప్రాకృతిక కార్యం క్రమంగా అంతరించింది.

ఆ మహాశూన్యాలనుండి స్వనాలు వినిపించవు
ప్రకృతి నిర్జన సీమలు సమాధానాలు పలకవు
ఎటు చూచినా నిశ్శబ్దమే విస్తరిస్తుంది ఎటు చూచినా
దేవతల ఆవిర్భావానికి ముందరి దివ్యత్వమే.
గుప్తంగా వున్న పరమాత్మ ఆదేశానికై
విశ్వశక్తి నిశ్చలంగా ఎదురు చూడసాగింది.

సాగరం తన లోతుల్ని తనే అన్వేషించ పూనినట్లు
అకస్మాత్తుగా దృష్టి అంతర్గతం కాసాగింది.
చైతన్య పూర్ణమైన దివ్యత్వం కేంద్రీకృతమై
అసంఖ్యాకమైన మహత్తులతో అతనిని చేరింది.

తన్మయత, తేజస్సు, ఓజస్సు, ప్రణయజ్వాల
అన్నీ ఒకే ఒక బ్రహ్మానందంలో ఏకం కాసాగాయి.
దివ్యత్వం నిండిన హృదయానికి స్థితి ఆ స్తిత్వం తెలిసింది.
ప్రతి ఒక్కటి ఆత్మగా, పరమాత్మను ఆశ్రయించింది

మహత్తర విశ్వలీలలన్నీ పరమాత్మ హృదయ స్పందనలే
వాటిని గ్రహించడం పరమాత్మజ్యోతిని గ్రహించడమే
మేధస్సు అనేక తీగల జంత్రవాద్య ప్రక్రియ
ప్రతి జీవితం అనేక జీవితాల సంగమగీతం.

లోకాలు అనేకాలైనా, అన్నింటి ఆత్మ ఒక్కటే
ఇప్పుడీ విజ్ఞానం రోదసికి బీజప్రాయమైంది

ఆ బీజం తేజస్సులో భద్రంగా దాచబడ్డది
దానికి అజ్ఞానపు ఆచ్ఛాదన అవసరంలేదు.

అప్పుడు అత్యద్భుతమైన సమాధి స్థితినుండి
ఏకైక హృదయంలోని తీవ్ర స్పందనల నుండి
అమలిన ఆధ్యాత్మిక విజయాలనుండి
వినూత్నమైన అద్భుత సృష్టి ఆవిర్భవించింది.

అసంఖ్యాకంగా ప్రవహించే దివ్యత్వాలు
అపరిమిత ఆనందాలు ఏకమై పోయాయి
జీవం అపరిమితంగా, విస్తృతంగా ఉన్న లోకాలలో
అహంకారం లేని ఆత్మ అనూహ్యంగా రూపుదాల్చింది.

బ్రహ్మానంద ఉద్దీపక శక్తులు కాలాన్ని
కాలాతీతంగా మార్చి పారవశ్యం కలిగిస్తాయి
సర్వం సర్వంతో కలిసినప్పుడు అంతా ధావళ్యమే
అక్కడ వైరుధ్యాలకు, భిన్నత్వాలకు తావులేదు.

ఆధ్యాత్మిక బంధాలు అన్నింటినీ అన్నింటితో కలిపి
చివరకు అక్షరమూర్తితో అక్షయంగా బంధించాయి.
దేనికదే ప్రత్యేకమైనా, అన్నింటినీ సమంగా స్వీకరించి
ఈ అనంత సంగతులను అనుసరించి పోయి
తనలోనే సమస్త విశ్వాన్ని దర్శించ గలిగాడు.

ఈ అనంత సృష్టివలయం యొక్క అద్భుతకేంద్రం
చివరివరకు, శిఖరాగ్రం వరకు విస్తరించి
ఆత్మానందంలోనే దివ్యానందాల్ని అనుభవించింది
అసంఖ్యాకంగా నున్న ఇతర ఆత్మలలోను అనుభవించింది

ఆది అవ్యక్త స్థితిలో నున్న రూపాలను, వ్యక్తులను
నిరంతరాయంగా తన పరిధిలోకి గ్రహించింది.
అసంఖ్యాకంగా, దివ్యసీమలలో సాగిపోయినట్లు
దివ్యత్వం అంతకు పదింతలుగా ప్రజ్వరిల్లింది.

ఎవరూ దూరంకాదు, ఎవరూ తనకై ఒంటరిగా జీవించరు
ప్రతి ఒక్కరు, తనలోని, సర్వజీవులలోని
పరమాత్మ కొరకే జీవిస్తున్నారు, ప్రతి ఒక్కరిలో
సర్వము అవ్యక్తంగా వ్యక్తం అవుతూవుంది.

అక్కడి ఏకాంతం ఒంటరి తనంతో ముడివడి లేదు
అది వేయి రూపాలలో ప్రత్యక్ష మవుతూవుంది.
తేజోపూర్ణమైన దాని సుస్థిర రూపం
సురక్షితంగా, పరిణామ రహితంగా ఉంటుంది.

సదా పరిణామం చెందే అసంఖ్యాకమైన రూపాలు
అప్రయత్నంగా దాస్యప్రవృత్తిని ప్రోత్సహిస్తాయి
విశృంఖలంగా కనిపించే సూక్ష్మనర్తన పథంలో
విశ్వశక్తులు నిర్దుష్టంగా, అద్భుతంగా పనిచేస్తాయి

బాహ్యరూపం తనలోని సత్యస్వరూపాన్ని వెతుకుతుంది
ఏకత్వం ఆడిస్తున్న నాటకంలో తేడా గ్రహిస్తుంది.
అది మానవులందరినీ పరమాత్మ అంశాలుగా మార్చినా
అన్నీ తిరిగి పరమాత్మలోని రహస్య అంతర్భాగాలే.

తన్మయస్థితి పరిపూర్ణంగా ఏర్పడినప్పుడు
సర్వవేదనలు మధురప్రేమ వేదనలవుతాయి.
అద్వైత స్థితివల్ల లభించే నిర్మలానందం
వైరుధ్యాలకు అతీతమైన రక్షణను కల్పిస్తుంది.

భయానకమైన వైరుధ్యాలు కలిసే సంగమరేఖపై
మహానాటకం అర్థాంతరంగా ముగిసినప్పుడు
ఆత్మదర్శనం ఫలితంగా కొంత దివ్యత్వం తగ్గినా
యోగ పరమైన సచ్చిదానందం లభిస్తుంది.

ఆ అఖండ బ్రహ్మానంద మాధుర్యంలో
నిర్గుణ పరబ్రహ్మ సహానుభూతి లభిస్తుంది.

అక్కడ వేదనల నిట్టూర్పులకు తావులేదు
ఒక ఆనందం నుండి మరొక ఆనందానికి అనుభవం పరుగులు–

అన్నింటిలోనూ అనశ్వరంగా వున్నది సచ్చిదానందమే
సర్వప్రకృతి భగవంతుని చైతన్య రూపమే.
అన్నింటిలో ప్రజ్ఞ ఆత్మగా, ఆత్మీయంగా చరిస్తుంది
అన్నింటిలో తేజస్సు అపరిమితంగా నిండి వుంటుంది.
అన్నింటిలో సత్యం జ్ఞానంవలె ప్రకాశిస్తుంది.
అన్నింటిలో సృజనశక్తి ప్రసరిల్లి వుంటుంది.
అనంతం నుండి శక్తి అవిచ్ఛిన్నంగా పరుగులిడి
క్షణికమైన భావనను కార్యోన్ముఖం చేస్తుంది.
నిశ్శబ్దం నుండి ఒక శబ్దం పైకివస్తుంది
ఒక సౌందర్యం నిశ్చల శూన్యం నుండి వెలువడుతుంది
కాలం గుండెనుండి విజ్ఞానం పెల్లుబుకుతుంది.
వ్యామోహ రహితంగా ఏది ఏమైనా కాగలదు.

దివ్యతేజస్సుతో పునీతమైన హృదయంలో
నిరాటంకంగా తన్మయస్థితి కలుగుతుంది
సర్వం పవిత్రప్రేమలో తాదాత్మ్యం చెందుతుంది.
సార్వజనీన దృష్టి అన్నింటినీ ఏకం చేస్తుంది.
ప్రతి హృదయం మరొక హృదయాన్ని స్పందింప చేస్తుంది.
ఆలోచనలు అంతర్గత శబ్దాలను వింటూ
హృదయ స్పందనల్ని అనుభూతిగా మార్చుతాయి
దానిని అందుకొనడానికి చేతులు అవసరంలేదు
చైతన్యానికి మూలమైన ప్రక్రియ లున్నాయి
అదే ఆత్మకు ఆత్మకు మధ్య ఆత్మీయతను పెంచుతుంది.
ఆధ్యాత్మిక శక్తుల అద్భుత స్వర సమ్మేళనం
అతీంద్రియస్థితిలో ఆత్మల పరివర్తన
సమేక స్థితిలో సంపూర్ణంగా ఏర్పడుతుంది.
అలా ప్రసరిల్లిన నూతన లోకాలలో

అతను విశ్వదర్శనం చేయగలిగాడు.
విశ్వవ్యాప్తమైన వెలుగుకు ఆకరం కాగలిగాడు
శాంతి మహాసాగరంపై ఏకైక తరంగమైనాడు.
అతని మేధ, అసంఖ్యాక మేధలకు సమాధానం చెప్పింది.
రోదసి సంభాషణకు అతని పలుకులు సంకేతాలు
విశాల సృష్టి స్పందనకు అతని జీవితమే భూమిక.

ఒకే లక్ష్యంతో, ఒకే గమ్యం వైపు పయనించే
కోట్ల అభిమతాల పద సవ్వడులు వినిపించాయి.
ఆ ప్రవాహం సదా నిత్యనూతనం – అది అమరం
ఆ ప్రవాహపు వేనవేల తరంగాల ఉధృతికి
దివ్య మాధుర్యాలు సైతం కలవరం చెందాయి
అతను తన ప్రత్యణువులో ఆ మాధుర్యాలను
నిశ్చల స్పందనలుగా, అఖండ సచ్చిదానందంగా
కోటి కోట్ల ఆనందాలను ఒక్కటిగా అనుభవించాడు.

అపార నిర్మల, భవ్య సామ్రాజ్యంలోని చరాచర
వస్తుచయంపైన ఈశ్వరీయత ఉంటుంది.
పరమోత్కృష్టమైన ఈశ్వర సామ్రాజ్యానికి చేర్చే
క్రమానుగతమైన కాంతి మండలాలు అతనికి కనిపించాయి.

ప్రతి మండలం పరమ సత్యానికే అనుబంధమైనా
ప్రతి మండలం స్వతంత్రమైన బ్రహ్మానంద నిలయమే
దేని సౌందర్యం దానిదే, దేని నైర్మల్యం దానిదే
అన్నీ ఒకే ఒక్క పరమ సత్యానికి ప్రతీకలు
అవి వాటి అంతరాలలోనే ఐకమత్యంగా ఉంటాయి.

ప్రతి ఒక్కటి పరిసర మండలాలకి తన శక్తి నిస్తుంది
కానీదాన క్రియవల్ల తన శక్తిని ఏమాత్రం కోల్పోదు
నిగూఢంగా, పరస్పరం సహాయం పొందే మండలాలు
సహాయం చేసినవి, పొందినవి అభివృద్ధి చెందుతాయి.
మిగిలినవన్నీ, అవి తమకే చెందినట్లు భావించి

శక్తిని, ఆనందాన్ని అన్నింటితో సమంగా అనుభవిస్తాయి.
ఆ సమస్థితిలో ప్రత్యేక ఆత్మలలోని ఆనందాన్ని
ప్రత్యేకంగా అనుభవించడం కోసం ఏకాంతం అవసరం.
ఒంటరితనంలోని ఏకత్వం సర్వత్వాన్ని ఆశిస్తుంది
అనేకంగా ఉన్న వన్నీ తిరిగి ఏకత్వాన్ని ఆశ్రయిస్తాయి.
సర్వజ్ఞతకు, సర్వ సృష్టికి మూలమైన బ్రహ్మానందం
దివ్య సత్యావిష్కరణకై రూపాలను వెతుక్కుంటుంది.
అగోచర పరమాత్మకు సంకేతాలైనమెరుపులు
మహత్తర సృష్టిపై చిత్రికి అనుకూలంగా
ఆత్మ దర్శించే స్వచ్ఛమైన, ధవళ మండలంలో

వర్ణ రహిత గగనంలో చిత్ర వర్ణాలుగా భాసిస్తాయి.
ఆ రంగులన్నీ పరమాత్మనుండి ప్రసరించేవే,
సృష్టికి హేతువులైన ఆనందం, సౌందర్యం, శక్తి – అవి.

ఒక విశాల సత్య చైతన్యం ఆ సంకేతాలను
దివ్యత్వాన్ని నింపుకున్న హృదయానికి అందిస్తుంది
ఆ హృదయం. సంకేతాలను ఆనందంగా స్వీకరించి
అవి ప్రసాదించే అతీంద్రియ దృశ్యాలతో తృప్తిపడి
వాటిని నిత్యాలుగా, సత్యాలుగా గ్రహిస్తుంది.
జీవుని నిష్పక్షపాత దృష్టి అద్భుతాలకు
మహత్తులకు నెలవవుతుంది కాల నిబంధనలేని
రహస్య శక్తులకు అది సంగమ కేంద్రమవుతుంది.

అది రోదసినే పరమాత్మకు మాయా మందిరం చేసి
కాల క్రమేణ అద్భుత శక్తుల్ని క్రమ్మరిస్తుంది
ప్రేమ సౌందర్యాన్ని, అద్భుత మహాత్యాలను
సచ్చిదానంద స్థితిలో ప్రదర్శిస్తుంది.
తల్లి బిడ్డతో ఆడుకున్నట్లు. పరమాత్మతో ఆడుతూ
జగన్మాత తన విశ్వమందిరంలో సంచరించసాగింది.

ఆతనికి విశ్వమే ఆమె ప్రేమహృదయం
అనంత సత్యాలే ఆతనికి ఆటవస్తువులు.
ఇక్కడ ఆత్మ కోల్పోయినవన్నీ అక్కడ దివ్యస్థానం పొందాయి
పొరపాట్ల వల్ల మనహృదయాలు పొందలేని శక్తులు
అక్కడ పరమసత్యాలుగా, నిర్మాలానందాలుగా భాసిస్తాయి.
నిరంతర సృష్టి ప్రవాహంలో మహాత్ములైనవారు
తమ తమ ఆత్మ ఔన్నత్యాలను అందుకుంటారు.
వారి మేధస్సు దివ్యజ్ఞాన కిరణాలకు ఆకరమై
మహత్వ భావనా బల తో రూపుదిద్దుకుని
సుందర స్వప్న లహరులలో విహరించగలదు
ఆలోచన మహత్తరమైన మంత్రదండం వలె
అగోచరాన్ని ఆహ్వానించి ప్రతిష్ఠించుకోగలదు
సత్యం చిత్రవర్ణ భావపక్షాలను విప్పి
సువర్ణమయ గగనంలో విహరించగలదు.
పరమాత్మను సన్నిహితంచేసే స్వప్నగీతాలను
దివ్యహృదయం పరవశించేటట్లు పాడగలదు.
అగోచర మూర్తిని సన్నిహితం, వాస్తవం చేసే శక్తి
భావమందిరంలో పరబ్రహ్మను సుప్రతిష్ఠించింది
అది మనస్సును, వివేకాన్ని, భావనను పరమాత్మ
అద్భుత లీలలతో వైభవంతో నింపివేసింది.
అద్వితీయ పరబ్రహ్మమే అనేక మూర్తులై
ప్రతిపదంలోనూ పరమేశ్వరనాదం వింటూ
ప్రతి వెలుగులో పరంజ్యోతినే దర్శిస్తూ
ప్రతి రూపంలో దివ్యమంగళ రూపాన్నే చూస్తూ
ప్రతి మంత్రంలోనూ దివ్యానుభూతిని పొందుతుంది.
ఆలోచనలన్నీ అనంత మూర్తితో నిండి పోతాయి–
భావనకు వాస్తవానికి మధ్య అఘాతాలు లేవు
ఒక శాబకం, మరొక శాబకాన్ని సంభావించినట్లే,

ఆచరణ సంకల్పానికి, సంకల్పం ఆలోచనకు విధేయం
ఆత్మకు ఆత్మకు మధ్య అనుబంధం పెనవేసుకుంటుంది
ఈశ్వరత్వం తోడి అనుబంధం కాలాన్ని పునీతం చేసింది
ఆమె ఆడించే ఆటలలో జీవుడు అలసి పోడు
ఆమె హృదయంలో ఆనందం, పెదవులపై హాసం
పరమాత్మ ఆడించే నాటకంలో అది ఒక సాహస దృశ్యం

ఆమె పరిణత ప్రజ్ఞా వైభవచాపల్యంతో
ఆమె కాలంపై నముద్రించే రమణీయ చిత్రాలు
చిత్ర విచిత్ర మానసిక విభ్రమాలు కలిగించి
ప్రతి మలుపులోను కొత్త పరిణామాలు చూపిస్తూ
ఆత్మ పరిశోధనలో అంతం లేకుండా చేస్తుంది.

ఆమె సంకల్పం అభేద్య కఠోర నియమాలు సృష్టించి
ఆలోచనలకు అందని సత్యాలను సృష్టించి
హృదయాన్ని సాహస కార్యాలకు సన్నద్ధ పరుస్తుంది
అప్పుడు సత్యం అనూహ్య రూపాలలో దర్శనమిస్తుంది
లేదా, రమణీయ రసగీతిక మరల వినిపించినట్లు
లోగడ అనుభవించిన ఆనందాలే పునరుక్తమవుతాయి.
ఆ వేదమాత హృదయంపై దాగుడు మూతలాడుతూ
కళాపిపాసి వలె ఆమె సృష్టిని గురించి ఆలోచిస్తాడు.
ఆ ఆలోచనలు ఎన్నటికీ అంతం కావు
ఆలోచనా రూపాలలోకి సాహసంతో చొరబడి
నరికొత్త సజీవ స్వప్నాలతో మురిసి పోతాడు

అభేదత్వంతో అలసిపోక, పరిణామంతో విసిగిపోక
అనంతంగా ఆమె సృష్టి కార్యాలు సాగిస్తూనే వుంది—.
దివ్యానందదాయకమై విచిత్ర ప్రక్రియగా
విశ్వవివశత్వం కలిగించే ఒక సజీవ గీతంగా
విశిష్ట రూపాల చలనచిత్ర చయనికగా
ప్రగతిశీల సన్నివేశాల ప్రదర్శన వేదికగా

హృదయావిష్కృత చిత్రాలకు కాదంబినిగా
ఒక ఆత్మ కోసం మరొక ఆత్మపడే ఆవేదనగా
దేవతామూర్తులతో ఆరాటం అభివ్యక్తమైంది
అక్కడ పదార్థం జీవధాతువు యొక్క సాంద్రస్థితి
అది ఆత్మానంద స్థితికి బాహ్య కళారూపం
అనంత భావ చిత్రాలుంది భద్ర మందిరం
అక్కడ వివేకం ప్రతిమలానందలోకాన్ని నిర్మించు కుంటుంది.
అది అఖండ సచ్చిదానంద నిలయం
ఆ మందిరంలో ఘడియలు క్షణాల్లా గడుస్తాయి.
అక్కడ ఇంద్రియాలు ఆత్మకు నిర్గమ మార్గాలు
మనస్సులోని ప్రతి చిన్న, పసి ఆలోచనకు
ఏదో కొంత దివ్యత్వం తోడై ఉంటుంది.
అక్కడి సర్వం ఆత్మ వేణునాద నినాదమే!
అది జీవాత్మనుండి వెలువడే మెరుపులవల
వినిర్మల ప్రేమకు అది మహత్తరమైన ఆకర్షణ
ఆ ఆరాటం, ఆరాధన పరమాత్మ రాకను
సన్నిహితం, మధురంచేసి అద్భుతంగా మారుస్తాయి.
దాని సుస్థిరతకు అమరత్వమే ఉపాదేయం
దాని సుస్థిరత్వం, మాధుర్యం, ఆకర్షణ, శాశ్వతత్వం
అన్నీ బ్రహ్మానందానికి కాంతిమయ సోపానాలే.
దివ్య ప్రజ్ఞతో, ప్రాభవంతో నిర్మితాలైన దేహాలు
ఆత్మను ఆత్మలతో సన్నిహితం చేయ వేగిరపడతాయి
బాహ్యదృష్టికి, స్పర్శకు ప్రబుద్ధమైన ప్రతిచర్య
హృదయానందానుభూతిని ప్రతిబింబిస్తుంది.
మహత్తరమైన ఆలోచనలు ఆత్మానందం కలిగిస్తాయి
జీవుడు పొందే బ్రహ్మానందంలోని వాడి, వేడి శాశ్వతం.
ఇక్కడ గతించేదంతా, అక్కడి అనంత సౌందర్యంలో
ప్రవిమల ప్రేమలో, ఆత్మ తేజస్సులో శాశ్వత మవుతుంది.
పరిమితకాలం దివ్యశాసనాన్ని బొదలదాల్చి

దివ్యదృష్టి అమరరూపాలను ఆశ్రయిస్తుంది
కాలం అన్నది పరమాత్మ కప్పుకున్న ముసుగు
ఆత్మలోని సజీవ శిలనుండి శిల్పిరూపం దిద్ది
అనంత సాగర తీరాలపైన రమణీయంగా
కమనీయ వాస్తవానికి వేసవి విడిది నిర్మించాడు.

ఆధ్యాత్మిక మండలాల్లోని వైభవానికి భిన్నంగా
తత్ప్రధాన శక్తులు, తద్విరుద్ధ శక్తులు ప్రజ్వరిల్లి
ఆ వైభవంపైన నీలినీడలు పరచి, అది అంతా
అనుమానాల మయమైనట్లు రాణించకుండా చేస్తాయి.
ఆ ప్రత్యేక పథకంలో రెండు విరోధ శక్తులున్నాయి
తనలోనే వున్న ఆత్మను తెలుసుకోలేని ప్రపంచం
అస్తిత్వానికి, మనుగడకు కారణాలు అన్వేషిస్తుంది.

తాను తయారుచేసిన లోకం గురించి తెలియని ఆత్మ
భౌతిక పదార్థం ముసుగులో జీవ రహితంగా ఉంటూ
స్వతంత్రించి, బయటపడి ఆధిపత్యం వహించాలనుకుంటుంది
ఇవి అన్నీ ఒకే వైవిధ్యానికి గట్టిగా ముడిపడ్డవి
అయినా ఆ విభిన్న రేఖలు ఎన్నటికీ కలుసుకోవు.
మూడు శక్తులు దాని వక్ర గమనాన్ని శాసిస్తుంటాయి.
మొదటిది అజ్ఞాతంగా వుండే ఒకానొక ప్రబలశక్తి
మధ్యన ఉన్నది రూపుదాల్చిన ఆత్మవేదన
చివరిది జీవితాన్ని అలక్ష్యంచేసే నిశ్చలత

మమత, అనురాగం లేని ఒక నిస్తేజగాథ
సందేహాస్పదంగా నున్న మనస్సుకు సత్యాన్ని అందిస్తుంది
అవివేకం మహాశక్తిగా, తనపాత్ర తాను ధరించి
మింగుడుపడలేని ఆమె కథను నమోదు చేస్తుంది.
అవసరం, అవకాశం చేయి చేయి కలిపినప్పుడు
అంధకారం నుండి జన్మించిన విచిత్ర జీవికి
జగన్మాత పథకంలోని మార్మికత అభివ్యక్తమైంది.

ఆ అజ్ఞానమే మన పరమ గమ్యాన్ని మరుగు పరుస్తుంది,
ప్రాపంచిక శృంఖలాల నుండి తప్పించుకొనకుండా
ఒక మహాద్భుత పరమ సత్యం యొక్క మహత్తుల్ని
అది ఆదిలోనే త్రుంచి వేస్తుంది—
అరూప శూన్యంలో తన సౌందర్యాన్ని వృథాపరచి
అగోచరమైన రహస్యంలో దాన్ని లయించి
ప్రపంచవిధి నెరవేరకుండా వదలివేస్తుంది.

అయినా, ఒక భావం జీవుని మహత్తర స్వప్నమై
పరిభ్రమించే మానవ మేధలో ఒక నీరవ చిత్రణమై
పాత సృష్టి నుండి కొత్త సృష్టి తల ఎత్తుతుంది
నిశ్చలంగా నున్న విజ్ఞానం బహిర్గత మవుతుంది
అణగి మణగి వున్న సౌందర్యం స్వర్గంగా భాసిస్తుంది
సుఖదుఃఖాలు రెండూ సచ్చిదానందంలో లయిస్తాయి
కడకు అశరీరవాణి వినిపిస్తుంది
పృథ్విపైన పరమాత్మ ప్రజ్ఞ ప్రభవిస్తుంది
ఈశ్వరలీలలు కాలానుగుణంగా నర్తిస్తాయి.

అది అంతా ఒక మహాశక్తి కల్పించిన భ్రమ
అది భ్రమలవల్ల ఏర్పడే అనవసర ఆర్భాటం
చూడడానికి నిశ్చలంగా, ఆత్మలో ఏకమైనట్లు తోస్తుంది
తాను గమనిస్తున్న నిరర్థక నాటకం పట్ల అనాసక్తత
సాగిపోతున్న జన ప్రవాహాన్ని, అనూహ్యంగా
అంతం చూడాలన్న నిరీక్షణ కనిపిస్తుంది.
అతను రేపటి ప్రపంచం బయలు తానున్న లోకాన్నే చూచాడు
అక్కడ చూచి, అనుభవించిన దానికన్న దివ్యత్వం అనుభవించాడు.
ఎక్కడో చైతన్యానికి దూరంగా కడపటి అంచుపై
ఈ భూగోళం అస్థిరంగా, అత్యల్పంగా కనుపించింది
గతించిన స్వప్నం తాలూకు ముద్ర దానిపైన
ఆత్మ ధరించిన రూపం తాలూకు దుర్బల ముద్ర అది.

ఆతని శరీరం మార్మిక స్వప్నాల్లోకి జారిపోయింది
తనకే అది కొత్తగా, క్రీనీడగా కనుపించసాగింది

ప్రపంచం కడు దూరంగా, కళావిహీనంగా, మనకు కానట్లు తోస్తుంది.
ఆత్మ పరమాత్మలు మాత్రమే వాస్తవాలు అనిపిస్తాయి.
ఒకప్పుడు ప్రేమించి, అనుభవించిన విషయ సుఖాలు
వేదనామందిరాలుదాటి స్మృతులుగా అతనిని చేరాయి.
ఒకప్పుడు తనదే అనిపించిన ఆ పిలుపుకు
ఒకానొక పరబ్రహ్మాంశ నిగూఢంగా సమాధాన మిచ్చింది.
అక్కడ శాశ్వతమైన అనంత ఏకత్వమే వుంది
అది తన దృష్టికి అగోచరమైన విధంగా
అంతరంగ సాగరాలలో మునిగి వుంటుంది,
నిస్తేజమైన భౌతిక లాలసలో దాగి, ఈ
ప్రాపంచిక అజ్ఞానాన్ని సుస్థిరంగా కాపాడుతుంది.

తన శక్తిలోని విశ్వవ్యాపకత్వాన్ని మభ్యపరచి
తన ఆత్మదైవ విశ్వజ్ఞత్వాన్ని పదిల పరచి
ఆత్మ బీజాన్ని అనిశ్చితత్వంలో ప్రతిష్ఠించి
తనదైన దివ్యత్వాన్ని, వైదుష్యాన్ని కోల్పోతుంది.
సర్వోత్కృష్టమైన సంకల్పానికి తానే ప్రతినిధి
అదే విజ్ఞానాన్ని అజ్ఞానంతో కరిగించి వేస్తుంది.
తప్పిదాల్ని, విషాదాన్ని, బాధల్ని, మృత్యువును ఆమోదించి
అజ్ఞానాంధకారానికి తగిన పరిహారం చెల్లించి
ప్రకృతి పతనంతో భౌతికంగా విముక్త మవుతుంది.
భౌతిక పరమైన కఠోర అంధత్వంలోకి
తన ఆత్మ ఎందుకు పయనించిందో ఆతనికి తెలుసు.
వక్రమార్గంలో పయనించే దివ్యశక్తులలో భాగం పంచుకుని
తానుగా పరమాత్మను చేరుకోవాలని ఆశించాడు.
ఇప్పుడు అతనివి రెండు దేహాలు, ఒకటి విశాలం, సర్వ స్వాతంత్రం
రెండవది, ఇక్కడి బాధలు యాతనలు అనుభవించేది

ఆ రెండు ప్రపంచాలను ఒక బంధం ముడి వేస్తుంది
కానీ దానికి అనుకూలత లభించదు, అది నిష్ఫలశ్రమ
అనంతమైన నిశ్శబ్దంలో సర్వం లయించిపోదు

అతని హృదయం ఎక్కడో ఒంటరిగా చైతన్యవంతమై
అట్టడుగున నిశీథిలో వెలిగే దీపంవలె ఉంటుంది
బహిష్కరించబడినట్లు, ఏకాకిగా, అనశ్వరంగా
అధిక ఆత్మసంయమనంతో నిశ్చలంగా ఉంటుంది.
అతని హృదయం త్యాగమయమై, హృదయం నివేదనగా
ప్రగాఢమైన మార్మికారాధనతో నిండిపోయి
దూరంగా కనిపించే ప్రేమవైపు, వెలుగువైపు మొగ్గుతుంది.
తన మూగ వేదనా ఫలితంగా లభించిన నిర్మల తేజస్సులో
తాను చూడలేని దివ్యశిఖరాలకై నెమకుతుంది.
తాను వదలి రాలేని ఆకాశాలనుంచి తపన చెందుతుంది.

అదృష్టవశాత్తు ఏర్పడిన నిశ్చల సమాధి స్థితిలో
స్వతంత్రస్థితికి, పతనస్థితికి మధ్యన ఎక్కడో
ఈశ్వర తేజస్సుకు, ప్రాపంచిక తమస్సుకు నడుమ
ఆరాధన ఒక్కటే తన ఏకైక పరమార్థంగా
సచ్చిదానంద స్థితి ఒక్కటే పరమగమ్యంగా
ఎవరూ భాగం పంచుకోనని, ఆనందాన్ని కాదని
ప్రశాంతి కొరకే ప్రశాంత జీవనం అన్న సూత్రాన్ని త్యజించి
హృదయ పూర్వకంగా జగన్మాత వైపు తిరుగుతుంది.
ఆ ఏకాంత, స్వాప్నిక, మాధుర్య స్థితి
ద్వారాలు మూసిన ధ్యాన మందిరం వలె ఉంటుంది
అక్కడ ఎటు చూచినా, నిర్మల ధవళ రజత చ్ఛాయలే
ఒకే ఒక్క నిశ్చల, నిర్మల కిరణ తేజస్సు కనిపిస్తుంది.
అది అగోచర పరబ్రహ్మకై నిర్గుణోపాసన
హృదయాంతరాల శాంతి సుస్థిరమైనప్పుడు
ఇతర ప్రపంచం నిశ్శబ్దంగా, శూన్యంగా మారిపోతుంది.

అప్పుడు పరంలోని సత్యం అవగత మవుతుంది.
యోగ నిద్రలో శరీర భాగాలన్నీ జడమై పోతాయి
ఒక మహాశక్తి క్రమక్రమంగా శరీరంలో ప్రవేశిస్తుంది.
అది ప్రాపంచిక నేరాలను, విషాదాలను భరించగలదు.
సృష్టిలోనే దీర్ఘకాలంగా జరుగుతున్న జాప్యాన్ని సహించి
జగన్మాత రాకకై అనేక సంవత్సరాలు నిరీక్షించి
చివరకు ప్రపంచానికి, మానవజాతికి అంకితమైన,
స్థితిలో ఇప్పుడు జగన్మాతను ఆహ్వానించడం జరిగింది.
అంతర్హితం కావడం వల్ల జ్వలితాగ్ని చల్లారదు
లో సృష్టి మనస్సులోని శూన్యాన్ని, సంకల్పాన్ని భర్తీ చేస్తుంది,
ఆలోచన నశించినప్పుడు మహాశక్తి ప్రవర్ధ మవుతుంది.
ప్రపంచంలోని ప్రతికూల శక్తుల మధ్యన, నిర్మల
బ్రహ్మానంద కీలకమైన సచ్చిదానందం ఏర్పడుతుంది.
అదే జీవితంలో ఏర్పడిన జాగాలను భర్తీచేస్తుంది
అదే ప్రశాంత ప్రార్థన పరమాత్మను చేరుతుంది.
ఆ మహానిశ్శబ్ద శూన్యాలను దాటి, తన ఆశల
అడుగుల సవ్వడి వినిపిస్తుందేమోనని చూస్తుంది.
ఆత్మ నిశ్చలమైనపుడు, పరబ్రహ్మ సందేశం
ఒక ఆజ్ఞగా తనను చేరుతుందని ఎదురుచూస్తుంది.

# పరప్రసాదం

ఇప్పుడు యోగికి తన హృదయమే రంగస్థలం- హృదయ మందిరం లోని జాగాలన్నీ జ్యోతిర్మండలాలే - వెలుగు మయాలే. అశ్వపతి తన లోకి చూడసాగాడు. ఓహ్, ఎంత పవిత్ర స్పందన! ఎంతటి దివ్యానుభూతి అది! మనస్సు, శరీరం, జీవం - అన్నీ బ్రహ్మానంద స్థితిలో ఒక్కటై నాయి. ఇప్పుడతను మామూలు మనిషికాడు, మరో తేజోరూపంతో, తేజ శ్శరీరంతో, ఈ ప్రపంచాన్ని, భౌతికతను అధిగమించి పైకి పోసాగాడు.

భూమిపైన మృత్యువు నీడ పడుతూనే వుంది. భూమి మృత్యువును జయించవలసి వుంది. మనిషికి బాధలు, యాతనలు తప్పడం లేదు. మనిషి చైతన్యవంతుడవుతున్నాడు, నిజం. కాని, మృత్యువును జయించడం లేదు. విధిని మార్చడం లేదు. మనిషి అటు పరమాత్మకు ఇటు పశు స్థితికి మధ్యగా ఉండి పోతున్నాడు. చీకటి వెలుగుల మధ్య తచ్చాడు తున్నాడు. ఈ అనంత నాటకంలో తన పాత్ర ధరించి, నిష్క్రమిస్తున్నాడు. 'పరిణామం' ఎంత వరకు సాగుతున్నది? పరిణామంలో తనపాత్ర ఎంతవరకు నిర్వహిస్తున్నాడు? అందుకే జగన్మాతకు తన హృదయాన్ని నివేదించుకున్నాడు. చేసిన పనులే మళ్లీ మళ్లీ చేస్తూ ఎంతకాలం జీవించడం!

అశ్వపతి ఉషస్సుకోసం ఎదురుచూడసాగాడు. జగన్మాతను పృథ్విపై అవతరించమని, జగత్తును, మానవాళిని ఉద్ధరించమని విన్నవించు కున్నాడు. ఈ చీకట్లను చీల్చి, లోకాన్ని వెలుగుతో నింపడానికి జగన్మాత అవతరించక తప్పదు.

అతనికి అమ్మ మాట ఇచ్చింది. ఆమోదం అందించింది. జగ న్మాత యిచ్చిన హామీతో ఈ లోకానికి తిరిగివచ్చాడు, ప్రపంచ నైజంలోకి, ప్రవృత్తిలోకి వచ్చిచేరాడు. కాని ఏం జరిగింది? మళ్ళీ కథ మామూలే! ఆ దివ్యదర్శనం స్మృతిమాత్రంగా తనలో మిగిలింది. ధ్యానంలో అన్ని

లోకాలు దర్శించగలిగి, జగన్మాత సాక్షాత్కారం పొందగలిగి తాను సాధించిందేమిటి? బయలుదేరిన చోటికే వచ్చిచేరటమా తపఃప్రయోజనం? భూమి గుండ్రంగానే వుంది! గుండ్రంగా తిరుగుతూనేవుంది.

అప్పుడు అకస్మాత్తుగా ఒక దివ్యస్పందన కలిగింది.
మహాశూన్యంలోని నిర్జీవ నిశ్శబ్దం నడుమ
అతి గంభీరమైన ఏకాంతంలో పరిచితమైన
అడుగుల సవ్వడివంటి శబ్దం కదలాడి
ఆత్మ అంతరంగాలలో వినిపించింది.

ఆ స్పర్శకు అతని ప్రత్యణువు ఆనందంతో పులకించింది
దాని ప్రభావం భౌతిక పరిధిని సమీపించగా
అతని హృదయం భవ్యహృదయానికి చేరువైంది
ఒక మాన్త్రికరూపం అతని భౌతికరూపాన్ని కప్పివేసింది.
ఆ సంస్పందన స్పర్శ నిశ్శబ్దాన్ని ఛేదించింది
ఆ అనుభూతిలో శరీరం, ఆత్మ ఏకమై
అవ్యక్త పరమానందంలో లీనమైనాయి
మనస్సు, శరీరం, జీవం తన్మయతలో కలిసిపోయాయి.

అమృత ధారలతో మత్తెక్కి మైమరచిన ప్రకృతి
మమతాను రాగాల మధురిమ ఆమెను చేరుకున్నాయి
మెరుపులై, వెలుగులై, అమృత వర్షంలో పునీతమై
అంతా చంద్రుని చేరాలని ఆరాటపడే అనంత సాగరమే.
అతని నరనరాన దివ్య నీరాలు నిండిపోయాయి
శరీరంలోని ప్రత్యణువు చైతన్యంతో మేల్కొన్నది
నరనరం ఆనంద జ్వాలలా మండిపోసాగింది
రక్తమాంసాలు సైతం మాధుర్యాన్ని నింపుకున్నాయి.
శూన్యాలైన హృదయకుహరాలు ఆనంద నిష్యందాలై
జగన్మాత పదసవ్వడికే పులకించ సాగాయి.
ఆనంద పారవశ్యంలో స్తుతి గీతాలు ఆలపించాయి
మగతగా, మత్తుగా, నిశ్చలంగా శరీరం మారినా

అతని హృదయం ఆమె శ క్తిని గ్రహించసాగింది.

తాను ఆరాధించిన బ్రహ్మం ఇప్పుడు తనలోనే ఉన్నాడు
జ్వాలా స్నిగ్ధ, దివ్యసుందర వదనం సాక్షాత్కరించింది
పెదవులు ఏవేవో మంత్రాలను ఉచ్చరించ సాగాయి
కనురెప్పలు జ్ఞానపత్రాలై భారంగా వాలిపోసాగాయి
చలువరాతి విగ్రహంవలె నిశ్చలంగా వుండి
విశాల ఫాలం, ఏకాగ్ర దృష్టి, సాగర గంభీరం,
అర్ధనిమీలత నేత్రాలు ఆకసంవైపు చూస్తూ
భగవంతుని రాకను, తనలో గుర్తింపాయి
మనస్సు గుమ్మంవద్దనే ఒక ఆకారం కదలాడింది:
హృదయ మందిరం నుండి ఒక సుస్వరం వినిపించింది:
"సృష్టి శిఖరాలను అధిరోహించిన వీరకుమారా !
వెలుగులో ఆత్మ నీ వెంటనంటి ఉండదు
పరలోక గవాక్షం వద్ద ఒంటరిగా నిలువు
నీవు ఆర్జించుకున్నదే నీది, అంతకు మించి అర్థించకు,
అజ్ఞానావరణలో ఉంటూ, అమరత్వాన్ని ఆశించే ఆత్మ
అంధకార ప్రపంచంనుండి ఉద్భవించిన ఓ వాణీ !
మూగవోయిన మానవ హృదయం కోసం ఎందుకు తపిస్తావు?
ఈ అంధకార ప్రపంచాన్ని ఆత్మదృష్టికి ఆవాహం చేస్తావు?
వివేకరహితమైన భూలోక భారాన్ని ఎందుకు తగ్గిస్తావు ?
మానవ మేధ పరిష్కరించలేని రహస్యం నాది
కాంతి గోళాల చలనానికి అంతిమ గమ్యం నేను
నాలోని అగ్నులు, మాధుర్యాలు జీవికి ఆలంబనలు.
నా ప్రమోదాలు, ప్రమాదాలు సైతం అపరిమితాలే,
అపరిమితమైన పతనాన్ని జాగృతం చేయకు
ప్రతికూల సమయంలో నా దివ్యనామాన్ని స్మరించకు
పరమాత్మ భారాన్ని మోయదగ్గ శక్తి మనిషికి లేదు,
'సత్యం' జన్మించిన వెంటనే అవమాగ్ర ధరణి విచ్ఛిన్నమవుతుంది.
మార్గాన్ని నిర్ణయించే భారం పరమాత్మకే వదలిపెట్టు

నీవు సాధించిన మహత్తర విజయంతో తృప్తిపడి
నీవు ఉన్నత స్థితిలో ఉన్నప్పుడు లోకానికి సాయపడు.
నిష్ఫలంగా సాగిపోయే దినాలకు దూరమై
కఠినాతి కఠినమైన నియుక్త కర్మలనుండి విముక్తమై
మానవాళికి దూరంగా, పరమ ఏకాంతవాసంలో
నిశ్చలంగా జీవిస్తూ, నిర్మల సచ్చిదానందంతో
నీ హృదయజ్వాలల్ని నాకు అర్పించమని కోరను.
భూమిపైన మృత్యువును జయించేటంతవరకు
వేదనలు, రోదనలు మనిషిని వెన్నంటి ఉన్నంతకాలం
మహత్తరమైన నీ ఆత్మ ఎలా విశ్రమించగలదు?
ఆ శక్తిని పంచుకోవడానికే నీ ఆత్మజన్మ ఎత్తింది
నీవు నీ ధర్మాన్ని పాటించి, విధిని నిర్వర్తించు
కష్టాలను దైవదత్తాలుగా భావించి, ఆమోదించు
నిరాడంబరంగా, విశ్వశ్రేయస్సుకై జీవించు,
మానవస్వభావంలోనే విశ్వ రహస్యం వుంది
మనిషి ఆలోచనలు, పథకాలు శిఖరాగ్రంపై మెరుపుల్లా
అవి జీవితంలో నిష్ప్రయోజనాలై అంతరిస్తాయి
మనిషి అచేతన ప్రపంచంలో ఒంటరిగా మేల్కొని
రోదసీ స్వప్నాలను మార్చాలని వ్యర్థంగా ప్రయత్నిస్తాడు
అర్ధ తేజోపూర్ణమైన పరలోకాలనుండి వచ్చిన
జీవుడు, ఈ అభావమండలాలకు కొత్తవాడు.
అనేకానేక ఊర్ధ్వలోకాలమధ్య సంచరిస్తూ
తన నివాసాన్ని తరచు మార్చుకునే పాంథుడు.
ఎడారివంటి శూన్యంలో తన కుటీరం వేసుకున్నాడు
పైనుండి స్వర్గం ఆదరాభిమానాలతో అతన్ని గమనించింది
అతను ప్రకృతిమందిరంలో అస్థిరమైన అతిథి
అస్థిరభావ సాగరతీరాల్లో పయనించే నావికుడు
అగోచర దైవిక శక్తులకై పరుగెత్తే వేటగాడు
దూరాన వున్న గుప్త తేజస్సుకై పరుగులిడే పాంథుడు

విశాల మార్గాలలోనే పరమాత్మ చిరు వెలుగు కనిపిస్తుంది
అతని యత్నానికి వ్యతిరేకంగా అన్నిశక్తులు ఏకమవుతాయి
భగవదన్వేషణలో తీవ్ర ఆటంకాలు ఏర్పడతాయి
ఆతనిని నిర్దయగా శూన్యం కబళించి వేస్తుంది
అంధకారం తన కబంధ హస్తాలతో బంధిస్తుంది
ఏవేవో గుప్తశక్తులు మోసగించి తరిమి కొడతాయి
భగవంతుని బద్ధశత్రువు లందరూ వ్యతిరేకిస్తారు.
అచేతనమైన ఆత్మ, నిద్రాణంగా పడివున్న శక్తి
జీవితం నుండి, ఆలోచనమండి, ప్రపంచాన్ని దూరం చేస్తాయి.
చీకటి పునాదులపై స్థిరపడిన రక్కసి విధిని
మృత్యువు అనుల్లంఘనీయంగా మారుస్తుంది
కాలంతో, పరిస్థితులతో రాజీపడి సాగిపోతున్నప్పుడు
చీకటి మూలల్లో, తల విరబోసుకున్న రక్కసి
కోరలు సాచి, మనిషిని కబళించాలని చూస్తుంది
అతని మార్గానికి అడ్డుగా, చీకటిలో పొంచివుండి
ఆత్మ-హత్యకు అమవైన ఆయుధాలు సిద్ధంచేస్తుంది.
అనంత కాలప్రవాహంలో మనిషి జీవితం క్షణికం
అతను గంటలకు, నిమిషాలకు బలి అవుతుంటాడు
ఇక్కడ భూమిపైన అవతరించి, స్వర్గాన్ని చేరలేక
ఇక్కడ అసంతృప్తితోనే పవిత్రంగా జీవిస్తూ
దైవత్వానికి, పశుత్వానికి మధ్యస్థంగా ఉంటాడు.
తన ఔన్నత్యం ఏమిటో, లక్ష్యం ఏమిటో తనకే తెలియదు
ఎక్కడి మండి, ఎందుకోసం వచ్చిందీ మరచిపోతాడు
అతని ఆత్మ, శరీరంతో కలహానికి సిద్ధమవుతుంది.
ఔన్నత్య శిఖరాలను అందుకోలేనంతగా పతనమై పోతాడు
అతని ప్రవృత్తి పశుప్రవృత్తిగా మారిపోతుంది
విచిత్ర వైరుధ్యమే అతని జీవన సర్వస్వం అయింది.
ప్రతికూల స్వభావమే అతని జీవనతామిక్ష
అతను స్వేచ్ఛను కాంక్షిస్తూ, బానిసత్వంలో బ్రతుకుతాడు.

కొంత వెలుగునైనా గుర్తించడానికి చీకటి అవసరం
కొంత ఆనందం అనుభవించాలన్నా విషాదం అవసరం
ఉత్తమగతులు పొందాలంటే మృత్యువు అవసరం
అతను అన్నిదిక్కులు చూస్తూ, ప్రతి పిలుపుకు స్పందిస్తాడు
మార్గం చూపించగల స్వచ్ఛమైన కాంతి ఏదీ కనిపించదు
అతని జీవితమే అంధునిచేతి దీపం, దాగుడుమూతలాట
తనలో తను అన్వేషిస్తూ, తననుండి నిష్క్రమిస్తాడు
తనను తానై గుర్తించి, తాను ఎవరో ననుకుంటాడు
అనవరతం పురోగమిస్తూ, పునాది భద్రంగా లేదనుకుంటాడు
అవిశ్రమంగా పయనిస్తూ, ఏ గమ్యాన్ని చేరుకోడు
లోకాన్ని నడిపిస్తాడు కాని, తనను తాను నడిపించుకోడు
తన ఆత్మను రక్షించుకుంటాడు, జీవితాన్ని రక్షించుకోలేడు.
మనస్సు కోల్పోయిన తేజస్సును ఆత్మ సంపాదిస్తుంది
అతను సంపాదించిన జ్ఞానం సందేహాస్పద మవుతుంది.
అగ్ని గోళం సైతం తన ఆలోచన నీడగా కనిపిస్తుంది
అప్పుడు అన్నీ నీలి నీడలే, ఏదీ యదార్థం కాదు.
తాను ఏంచేస్తున్నది, ఎటువెడుతున్నది తెలియక
అజ్ఞానంతో వాస్తవ చిహ్నాలను కల్పిస్తుంటాడు.
తాను భౌతికంగాచేసే తప్పుల్ని సత్యానికి ఆపాదిస్తాడు.
వివేకం మాయముసుగులతో అతన్ని ప్రలోభపెడుతుంది
దాని నిజరూపాన్నిమాత్రం ఎన్నటికీ చూడలేడు
అతని విజ్ఞానసంపదను అజ్ఞానం కప్పివేస్తుంది.
ఈ భౌతిక ప్రపంచం అనే భౌతికరూపంలోని
సృష్టి వైచిత్రిని తెలుసుకోవాలన్నా ఆకాంక్ష వున్నా
అతని వ్యక్తిత్వం చాలదు, సరైన అనుమతిపత్రం లేదు
'తాను' కానిస్థితిలోనే ఉండిపోవలసివస్తుంది.
తను శాసించబూనిన అజ్ఞానానికి తానే తలవంచి
తన 'ఆత్మ'స్థితికోసం భౌతికలాలసలో మునిగిపోతాడు
తాను కోల్పోయిన క్షుద్రరూపాలనుండి జాగృతమై

భూదేవి తన శక్తులను అతనిచేతికి అందిస్తుంది.
అతను బాధతో ఆ బాధ్యతను స్వీకరిస్తాడు
ఆమె మార్గాలలో అతని మనస్సు నిరుపయోగమైన దీపశిఖ.
శ్వాస ఆలోచనగా, రక్తమాంసాలు అనుభూతిగా
అతను మూర్ఖ, మందబుద్ధితో శ్రమిస్తాడు
జ్వలితాగ్ని శిఖలవంటి ఆలోచనలతో
అంధకార ప్రపంచంలో ప్రవేశించే విజ్ఞానానికి
అసూయాద్వేషమయ లోకాన్ని ప్రేమతో నింపడానికి
తనభావన సంకల్పం అనే తాంత్రికద్వారం తెరుస్తుంది.
భూమిని స్వర్గాన్ని సంధానపరచలేని మేధస్సు
వేయిబంధాల భౌతికత్వంతో ముడివేసుకుంటుంది
అతను తానే భగవానునిగా చైతన్యం పొందుతాడు.
ఒకానొక ప్రజ్ఞ, వివేకం అతనిలో ప్రస్ఫుట మైనప్పుడు
మనస్సు, ఆత్మ తమ వైభవాన్ని వదలి వేసి నప్పుడు
రేతస్సుతో వంశాంకురాన్ని విస్తృతించాలని
చీము, గాలి కలిపి చేసిన ఈ విచిత్ర ప్రయోగంలో
మానవుడు పశుపక్ష్యాదుల వైజంతో భాగంపంచుకుని
తన ఆలోచనలను ఉన్నత పథాల వైపు మళ్లిస్తాడు.
అతని జీవితం మానవత్వపు మధ్య మార్గంలోనే ఉంటుంది.
తను అంతవరకు కాపాడుకుంటున్న భౌతిక సంపద వదలి
తన తనువును యాతనలకు, మృత్యువుకు వదలి పెడతాడు.
ఇంద్రజాలాలతో విసిగిపోయిన మాంత్రికుని వలె
అతీంద్రియ శక్తులు కోల్పోయి నిర్వీర్యమైన ఆత్మవలె
భగవంతుని అస్తిత్వాన్ని శంకిస్తూ, మూర్ఖహృదయంతో
ఈ లోకాన్ని ఆరంభించిన చోటనే వదలి విశ్రమిస్తాడు.
చేయవలసిన పని పూర్తికాకుండానే ఫలితం ఆశిస్తాడు.
అలా జీవుడు సృష్టి లక్ష్యాన్ని విస్మరిస్తాడు.
మధ్య మార్గంలోనే తన అదృష్టాన్ని విలిపివేస్తాడు.
అది విశ్వయోజన కరమైన సుదీర్ఘ ప్రయోగం.

ఉన్నతాదర్శం వక్ర మార్గంలో సందేహాస్పదంగా మిగిలింది
ప్రాపంచిక జీవనం గమ్యం చేరకుండానే జరిగింది
అగోచరమైన ప్రమాదకర భూమికపై అదే
వక్రగమనం పునరుక్తమవుతూ ఉంటుంది.
కొంత దూరం పయనించి వెనుతిరిగి పోతుంది.
ఫలితాలు తెలియకుండానే ఘనవిజయాలు సాధిస్తారు
అసమాప్త నాటకం అలా అనంతంగా సాగుతుంది.
తనకు అనుకూలమైన, బృహత్తరమైన ముసుగులో
మహత్తర లక్ష్యం తన ముఖాన్ని చాటు చేసుకుంటుంది.
ప్రజ్ఞవల్ల, అవకాశం వల్ల లభించే బహుమతుల బలంతో
బ్రహ్మాండమైన అంధకారం కుప్పిగంతులు వేస్తుంది.
మానవ ప్రయోగం విఫలమైన కారణంగా
భగవంతుడు నిరాశతో, ఆదిలోనే ఆగిపోతాడు
తాను కల్పించుకున్న రూపాలలో ఆత్మమాత్రం చిక్కువడుతుంది,
పరమాత్మ నేతృత్వంలో మనిషి వైఫల్యం అపజయంకాదు
అన్నింటిలో విచిత్ర మందగమనం సాగుతూనే వుంటుంది
ఒకానొక నిర్గుణశక్తి సగుణ ప్రపంచాన్ని సృష్టించింది.
ఒకానొక అతీంద్రియ శక్తి మనిషి ఆత్మను నడిపిస్తుంది,
అదే తన మార్గంలోకి ఆత్మను మళ్ళిస్తుంది
దానికి మార్గం తెలుసు, అది అప్రతిహతమైన మార్గం
పరమాత్మ మార్గదర్శి అయినప్పుడు గమ్యం అగమ్యం కాదు.
మనిషిని తన మనస్సు, శరీరం మోసగించినా
అతని నిర్ణయాన్ని శాసించే అంతరాత్మ ఒకటి ఉంది
గమ్యం తప్పినా, గమనం శూన్యం అయినా
కడకు పరమాత్మను చేరే మార్గం కనిపిస్తుంది
ఈ ప్రపంచ పురోగమనానికి అంతం లేదు
శరీరాన్ని ఆశ్రయించిన ఆత్మకు విశ్రాంతి ఉండదు
జీవితం అలా సాగుతూ కాలంతో మలుపులు తిరగాలి.
అంతరంగంతో పరమాత్మ ఒత్తిడి ఎక్కువైనప్పుడు

ప్రాపంచిక సుఖలాలసలు మనిషికి విశ్రాంతి నివ్వవు
తనను తాను గుర్తించేవరకూ, అతనూ విశ్రమించడు.
అతనికి మార్గంచూపే జ్యోతి, సాయపడే శక్తి ఉన్నాయి
అవి పైకి కనిపించవు, అనుభూతికి మాత్రం అందుతాయి
తనకు తెలియకుండానే తనలో సర్వజ్ఞత్వాన్ని పొందుతాడు
మానవుడుగా అధిమానవ శిఖరాలకై వెదుకుతుంటాడు
దివ్య ప్రకృతిలో దాగిన మేలిమిని అరువు తెచ్చుకుని
అమరత్వానికి బంగారు బాటలు నిర్మించుకుంటాడు.
దివినుండి దేవతలు మనిషి చర్యలు గమనిస్తూ
నేటి అసంభవాలను రేపటికి పునాదులు చేస్తుంటారు
పరమాత్మ స్పర్శతో అతని భౌతికత పులకిస్తుంది
బ్రహ్మపథంలో అతని అవరోధాలన్నీ తొలగిపోతాయి
అమరమూర్తులు అతని జీవనంలో ప్రవేశిస్తారు
అగోచర పరమాత్మ రాయబారులై అతనిని చేరుతారు
భౌతిక వాతావరణంలో దివ్యత్వం ప్రవేశించగా
ప్రేమ అభ్యాగతివలె అతని హృదయంలో ప్రవేశిస్తుంది
క్షణకాలం అద్భుత సౌందర్యం అతనిని అలరిస్తుంది
మహత్తర ఆనందాలు అతనిని పరామర్శిస్తాయి
కొన్ని క్షణాలపాటు తననుండి తాను వేరవుతాడు
అనవరతం తనముందర కనిపించే మహాత్మ్యం
మృత్యురహిత మాధుర్యాన్ని, మమతను అందిస్తుంది
పరమాత్మ శబ్దం వినిపించిన నిమేషకాలంలో
అతని మనస్సు చిత్రమైన అగ్నితాపానికి గురి అవుతుంది
అపూర్వ సంకేతాలేవో వాక్కును అధిగమిస్తాయి.
ప్రచ్ఛన్న ప్రజ్ఞలు అతని మేధస్సులో సుడులు తిరిగి
సగం సగం దివ్య చిత్రాలతో కలవర పెడతాయి
కొన్నిసార్లు అవ్యక్తానందాన్ని అనుభవిస్తాడు
కొన్నిసార్లు పరమాత్మతోనే సంభాషిస్తాడు.

అతని జన్మ చిత్రమైన అద్భుతానికి ఒక సంకేతం
అది అమరత్వానికి, ఆధ్యాత్మికతకు నిలయం
అది విశుద్ధపూర్ణత్వానికి, నిష్కళంక ఆనందానికి నెలవు
అవే మానవునికి చిత్రమైన మహనీయ వరాలు
తాను ఆశించిన పరిణతి, భూదేవి అతనిలో గుర్తిస్తుంది
ఆ పరిణామాన్ని ఆమె ముందుగా తనలోనే గమనించింది
పరిణామ గతికమైన పృధ్విలో దివ్యత్వం పొటమరించి
ప్రకృతి వేదికపైన స్వర్గంగా పరిణామం చెందుతుంది
ఆత్మజన్యమైన అనవద్య మార్గానికి కట్టుబడి
యుగయుగాలుగా భరిస్తున్న వెలుగును వదలలేక
అంధమానవతకు, బాధామయ జీవితానికి సహకరిస్తుంది.

"—నీ ఆత్మ మహత్తర ఆశయాన్ని ఔదలదాల్చు!
అంధకారంలో పరమాత్మ చేసుకున్న ఒప్పందానికి నిదర్శనంగా
అది దివ్య ప్రశాంతినుండి క్రమంగా జారిపోయి
కోర్కెలను ఆశ్రయించి, కష్టాలకు కారణమవుతుంది.

నీవు ఆత్మోన్నతిని సాధించి, శ్రమించి, స్థిరపడు!
నీ శ్రమ ఎంత విస్తృతమైనా, జ్ఞానానికి దూరం కావద్దు
ప్రాపంచిక పరిధిలోని శక్తిని వ్యర్థం చేసుకోవద్దు
అనంతమైన కాలంతోకలిసి కర్మలను ఆచరించు.
అనంత దివ్య శిఖరాలపై పయనించే పధికుడవై
అగమ్య, అగోచర మార్గాలలో పయనిస్తూ
కాలంతోపాటు మలుపులు తిరుగుతూ, దేవతలను
మానవులకు అందుబాటులోనికి తీసుకురా!

నా తేజస్సు నీలో ఉంటుంది, నాశక్తి నీదవుతుంది
అపహాస రక్కసిని నీ హృదయంలో ప్రవేశించనీయకు
అసంపూర్ణ ఫలితాన్ని, అసమగ్ర బహుమతిని ఆశించకు,
ఒకే ఒక్కవరం, ఆత్మ ఔన్నత్యం కావాలని అడుగు!
ఒకే ఒక్క ఆనందం, నీ మంచిని పెంచేది వాంఛించు!!

అంధవిధికి, ప్రతికూల శక్తులకు అతీతంగా
అచంచలమైన మహాసంకల్పం ఒకటి వుంది.
నీ కర్మ ఫలాన్ని మహాశక్తికి కైంకర్యం చేయి
పరమాత్మ ప్రభావంతో సర్వప్రపంచం మారిపోతుంది."

నినద గంభీరమైన ఆ దివ్యవాణి శూన్యంలో కలిసిపోయింది.
అప్పుడు శూన్యగగనంలో ఏ మాత్రం కదలిక లేదు:
శబ్ద ప్రపంచాన్ని పూర్ణనిశ్శబ్దం ఆవరించింది
ఎటు చూచినా, మూగపోయిన అనంత దివ్యప్రశాంతే

అశ్వపతి హృదయం ఆమెకు సమాధానం పలికింది
శూన్య నిశ్శబ్దాన్ని చీల్చుకుని అతనిగొంతు వినిపించింది:
"ఈ సృష్టి మాయ తెరమాటున, నీ సుందర
సురుచిర భవ్యరూపాన్ని దర్శించిన నేను
అనాసక్తమైన ప్రాపంచిక విషయాలలో తలదూర్చి
నిరర్థకంగా, కాలం గడుపుతూ, ఎలా బ్రతుకను, దేవీ!
నీ బిడ్డలనే నీవు కఠినంగా శిక్షిస్తున్నావమ్మా!

మృత్యురహితమైన మహాశక్తికి ఆలంబన మేము
దేవగణాలకు సైతం నిర్మాతలం మేము
ఈ అంధకారంలో ఎంతకాలం మా ఆత్మలు పోరాడాలి?
ఎంతకాలం ఓటమిని భరిస్తూ మృత్యుభారం వహించాలి?

ఇక్కడ నేను నిర్వహిస్తున్న కార్యభారం నీదే అయితే
ఈ అకృత్యాలమధ్య జీవితాన్ని వృధాచేయడం ఎందుకు?

అస్పష్టంగానున్న మానవ చైతన్య మేధలో
నీ మహాతేజస్సును ఏమాత్రం ప్రవేశపెట్టవేల తల్లీ?

ఇలా శతాబ్దాలు, యుగాలు గడచిపోతున్నాయి.
ఏవీ నీ ఆగమన సూచకాలైన ఉషోదయ కాంతులు?

ఏవీ నీ విజయసంకేతాలైన రెక్కల చప్పుళ్ళు?
మాకు వినిపిస్తున్నవి సాగిపోయే దేవతల అడుగులే.

అతీంద్రియమైన అనంతమేధస్సు వెనుక
జ్ఞానదృష్టికి సంబంధించిన పథకం ఒకటి ఏర్పడ్డది.
ఏ మార్పులేకుండా యుగాలు, తరాలు గడుస్తున్నాయి
ఏ మార్పుకోసమో పునర్నిర్మాణం సాగుతూవుంది.
మేం చేసిన పనులే తిరిగితిరిగి చేస్తూఉన్నాం.

మధ్యనవచ్చే ఆరంభాలు, పునఃప్రారంభాలు మామూలే.
నిష్ఫలంగా జీవితచక్రం పరిభ్రమిస్తూనేవుంది
కొత్తగా ఏర్పడే యుగాలు, పాతవాటివలె నశిస్తున్నాయి
ఈ సృష్టిరంగం ఏర్పడిన లక్ష్యం నెరవేరేవరకు
విషాదచరిత్ర ఇలా కొనసాగుతూనే వుంటుంది.

ఇప్పుడు మాలో ప్రభవించే శక్తులు అత్యల్పం
ప్రకృతి కనురెప్పలు దాటివచ్చే కాంతి అతిస్వల్పం
మా బాధలకు ప్రతిఫలంగా లభించే ఆనందం అల్పం
తనగురించి తానే తెలుసుకోలేని మూర్ఖప్రపంచంలో
ఆలోచనలేని జన్మచక్రంపైన మేము జీవిస్తున్నాం.

మావికాని ఏవేవో ప్రేరణలతో, మా రక్తాన్ని
వెచ్చించి లక్ష్యాన్ని సాధించాలనుకుంటాం
కాని, అరకొర విజ్ఞానం, అర్థసృష్టి సత్వరం వీగిపోతాయి
నశ్వరమైన దేహంలోని అనశ్వరమైన ఆత్మ
మా శ్రమను, పరిశ్రమను నిరుత్సాహపరుస్తుంది.

నిరాశా నిస్పృహలకు లోనై మేము బ్రతుకుతుంటాం.
ఒక మహోదాత్తుడు, సహృదయుడు, మహాత్ముడు,
రూపుదాల్చిన సత్యం వంటి ఒక సువర్ణమూర్తి
దివ్యలక్ష్యాన్ని ఆచరణలోపెట్టగల ధీశాలి,
పరమాత్మ తానై భౌతికరూపంలో అవతరిస్తాడని,
కష్టకాలంలో మామధ్యనే జన్మిస్తాడని ఆశిస్తాం
అతడే ప్రవక్త, ప్రయోక్త, ప్రభువు, ప్రేమమూర్తి.

నీ సృష్టి ఏమాత్రం విఫలంకాదని మాకు తెలుసు
భౌతికమైన ఆలోచన మసగవెలుగులో
నిగూఢమైన నీ కరచరణాలు కనిపించవు.
అవసరం, అవకాశం అనే ముసుగువేసుకొని
విధి చీకటి తెరల చాటున దాగివున్నా
ఆమె అనంతయాత్రను నెమ్మదిగా సాగిస్తుంది
ఆ సంకల్పం, ఇచ్ఛ అనుల్లంఘనీయాలు.
ఆరోహణక్రమంలో జీవితం స్థిరపడివుంటుంది
పరిణామసూత్రాన్ని తప్పించడం అసాధ్యం
ఆరంభంలోనే అంత్యక్రియల ఏర్పాట్లు జరిగాయి
నిర్జీవ పదార్థంతో తయారైన మానవ శరీరం
పశువుకు పరమాత్మకు మధ్య అనుసంధానకర్త
నీ అద్భుత సృష్టిలో మనిషి ఉదాత్తుడు కాడు
నిస్తేజంగా, నిశ్చలంగావున్న అంధకార మందిరాలలో
ఇటు ప్రకృతికి, అటు స్వర్గానికి మధ్యగా ఆత్మ
పరుచుకున్న గగనమంతగా విస్తరిస్తుంది.
అదృశ్యంగా ప్రవహించే ఆనందపు వెల్లువలో
ఒక దేవత దిగివస్తుంది, ఆనందం వెల్లి విరుస్తుంది.

ఆ నిద్రాణ మందిరంనుండి ఒక శక్తి ఉదయించింది.
మందంగా, నత్తనడక నడిచే కాలాన్ని వర్జించి
అస్థిరంగా, చంచలంగా వున్న ప్రాపంచిక దృష్టిని వీడి
అత్యంత తేజస్సులో సైతం, యోగి విశ్రమించగలడు.
సర్వం దర్శించగల జ్ఞాన నేత్రాన్ని దుర్భరాగ్నులు క్రమ్మగా
ప్రశాంత హృదయంనుండి విధి వాణి వినిపిస్తుంది
పరమాత్మ సన్నిధిలో క్షణాలు అనంతంకాగా
కాలాతీత స్థితినుండి కాలాన్ని సమీక్షిస్తుంది
కఠోర మానసిక నియమాలను అతిక్రమించి
భౌతిక జగత్తు అవరోధాలను దాటిపోగలదు
అప్పుడు దివ్యదృష్టికి రామన్న విషయాలు తెలుస్తాయి.

బ్రహ్మాండమైన శివతాండవం గతాన్ని ఛిద్రం చేస్తుంది
లోకాలు పతనమవుతున్న ప్రళయఘోష వినిపిస్తుంది
భూమిని ప్రళయాగ్నులు, మృత్యువు క్రమ్మివేస్తాయి.
మృత్యుదేవత ఆకలికి లోకమే ఆహారమైంది
ఎటుచూసినా ప్రళయ రక్కసి రెక్కల చప్పుళ్ళే
నా చెవులలో భయంకర రణరంగ కోలాహలం
భయంకర హాహాకారాలు నిశీథాన్ని కలవరపరిచాయి
ఈశ్వర ప్రభలు వైతాళికులై, స్వర్గం అంచుల
జన్మ సోపానాలపై గుంపులుగా పరుగులు తీస్తూ
జీవితంవైపుగా కదలటం నేను గమనించాను.
దివ్యావతరణకు పూర్వ వైతాళికులవలె
వారు ఉదయతార వెలుగుల్నిదాటి
భౌతిక జీవనం అనే చిరుమందిరం ప్రవేశించారు.
వారు యుగసంధ్యను దాటి రావడం నేనుచూచాను
మహత్తర ఉషస్సులో నయన తారలైన బాలలు
విశాల శాంతిసీమలలో సృష్టిసంధాన కర్తలు
వారే ఈ లోకపు అడ్డుగోడల్ని ఛేదించగలవారు
ఆమె సంకల్పానుగుణంగా విధితో పోరాడగలవారు
దివ్య సైకతసీమల శ్రమించే కార్మికులు వారు.
అగోచర పరమాత్మకు చెందిన వార్తాహరులు
అమరత్వానికి ఆద్యులైన శిల్పివరులు వారు
వారు పతనమైన మానవ పరిధిలో ప్రవేశించారు
వారి ముఖాలపై ఇంకా చెరగని దివ్యవర్చస్సు ఉంది
వారు పరమాత్మ హృదయంతో సంభాషించగలరు
వారి శరీరాలు ఆత్మసౌందర్య తేజోభాసురాలు.
మార్మిక అగ్నిని, మార్మిక వర్చస్సును, సంపూర్ణ
సచ్చిదానంద మధువును వెంటబెట్టుకుని
దివ్య మానవతను కన్నులలో ప్రతిబింబిస్తూ

అగోచర ఆత్మ గీతాలను పెదవులపై ఆలపిస్తూ
కాలం పరచిన రహదారులలో నడుస్తుంటారు.

వారు ప్రజ్ఞా ప్రాభవాలకు, మమతానురాగాలకు కర్తలు
సుందర తేజోపూర్ణ పథాల పరిశోధకులు
అత్యద్భుత ప్రేమ ప్రవాహాలలో ఈదగల వారు
సచ్చిదానంద స్వర్ణమందిరంలో ఆనంద నర్తకులు
ఒకనాడు వారేరాక లోకపు బాధల్ని తొలగించగలరు.

ప్రకృతి వదనంపై వెలుగు కిరణాల్ని ప్రసరించగలరు
శాసించే విధి ఎక్కడో పరలోకంలో ఉన్నప్పుడు
మన శక్తి సామర్థ్యాలు వెచ్చించి చేసే పనులు నిష్ఫలాలు
బాధల్ని అనుభవిస్తూ, అన్నింటినీ భరించాలి.

అడవి జంతువును వేటాడుతూ వచ్చే ముదుసలి వలె
మనిషి అసమర్థ ప్రాపంచిక కార్యనిర్వహణ వెనుక
బాధలు, కన్నీరు, శ్రమ, తగినంత ఖర్చయిన పిదప
దివినుండి దివ్యమూర్తి తప్పక అవతరిస్తాడు.

మానవ మేధ ఏ మేరకు ఆలోచించగలదో అతనికి తెలుసు
మానవ హృదయం సాహసించని కార్యం అతను నిర్వహిస్తాడు.

కాలపరిమితులకు లోబడి తాను ప్రవర్తించినా
దేవతల బరువు బాధ్యతలు తానే వహిస్తాడు
దివ్య తేజస్సు ప్రాపంచికత్వంపై ప్రసరిస్తుంది.
దివ్య శక్తులతో మనిషి గుండె నిండిపోతుంది.

లౌకిక ప్రయత్నాలు అధిమానవ శిఖరాల్ని అందుకుంటాయి
లౌకిక దృక్పథం అనంత విశాలమవుతుంది
అసంపూర్ణ ప్రపంచం, మార్పులేక అతిభారమవుతుంది
ఉజ్వల కాల యవ్వనం వృథా అయి విఫలమవుతుంది.

సంవత్సరాల తరబడి కష్టించి కృషిచేసినా
మానవుని ఆత్మపై పడిన ముద్రలు చెరిగిపోవు.

జగన్మాత హృదయం మాత్రం బరువెక్కుతుంది.
సీ రహస్య మండలంలో సత్యం సురక్షితంగా వుంది
మూతపడిన స్వర్గాలలోకి ఆమె మహత్తర వాణి
అంతరంగ తేజస్సుగా ఉపసంహరించుకుంది.

ఓ జగన్మాతా! సృష్టికర్త్రి, అనంత కళావిలాసినీ!
కాలం తన హృదయాన్ని పరమాత్మ ముందు విప్పలేదని
బంగారు కాలంపై విస్కారణంగా కినుక వహించకమ్మా!
విశ్వవినోద తేజోపూర్ణ కాసారమవు నీవు,
నీకు ప్రాపంచిక బంధాలు లేవు, పొందవలసిన పరమార్థంలేదు.
అందుకోగల వారికి సచ్చిదానందం లోపలనే వుంది.
బయట ప్రయత్నించే వారికి అది ఎన్నటికి లభ్యంకాదు.

విశ్వ రాహస్యమే నీ తలలోని వాల్కగా
నీ మహత్తర శక్తిని ఉజ్వలంగా ఆవిష్కరించుదేవీ!

నీ సజీవ రూపం ఏదైనా భూమికి భవ్య సందేశమే!
ఒక్క క్షణ కాలం నీ అనంతత్వంతో నింపి
ఒక్క శరీరంలో నీ దివ్యత్వాన్ని ప్రతిష్టించు
ఒక్క మేధలో విశ్వవిజ్ఞాన కాంతి సాగరాన్ని నింపు
ఒక మానవ హృదయంలో సర్వ ప్రేమను సమీకరించు!

దేవీ, మానవ రూపంలో నీవు భూమిపైన అవతరించి,
భౌతిక రూపంలోనే స్వర్గ సౌందర్యాలను ఆవిష్కరించు
అనంత శక్తి స్వరూపిణీ! ఈశ్వర శక్తిని పొంది
మానవ సంకల్పంతో క్షణాలను, చలనాలను
మానవ కాలంలోకి ఈశ్వర శక్తిని అనువదించు,

నీ వీక్షణ కటాక్షంచే భవిష్యత్తును మార్చు దేవీ!
ఆ దివ్య శిఖరాల నుండి నీ వాణిని వినిపించు
ఒక్క మహత్కార్యంతో విధికవాటాలను తెరువు!"

పరబ్రహ్మను చేరే శక్తి తనలో లోపించి నట్లు
విరోధించే వేలాది ప్రతికూల శక్తుల ఫలితంగా

అతని విన్నపం విశీథిలో లీనమైపోయింది
కానీ, ఒక వాణి తనలో, మహత్తరంగా వినిపించింది.
ఆ శబ్దంలో సౌందర్యం జాలువారింది,
ఆ దివ్య రూపంచుట్టూ తేజోవలయాలు పరుచుకున్నాయి.
ఆ దేవి పెదవులపై దివ్య దరహాసం రూపుదిద్దుకుంది:

"ఓ మార్గదర్శీ! నీ అభ్యర్థన ఆలకించానయ్యా!
ఎవరో ఒకరు అవతరించి, కఠోర నియమాన్ని ఛేదించి
తన ఏకైక ఆత్మబలంతో ప్రకృతి విధిని మార్చాలి.
ఈ ప్రపంచాన్ని భరించగల అపరిమిత మేధ
మహానిశ్శబ్దాన్ని దాచుకున్న తీవ్ర మాధుర్య హృదయం
దేవతల మమతల్ని పంచుకుని దిగివస్తాయి

అన్ని శక్తులు, ఔన్నత్యాలు ఆమెలో ఏకమవుతాయి.
దివ్య సౌందర్యం భువిపైన రూపుదాల్చుతుంది.
ఆమె విసీల కపోలాలలో ప్రమోదం విశ్రమిస్తుంది.
పక్షి నిజఆవాసమైన వృక్షాన్ని చేరినట్లు, అమర ప్రేమ
ఆమె శరీరంలో మహత్వ పక్షాలను విదల్చుతుంది.
విషాద రహిత సంగీతం ఆమె ఆకర్షణను పెంచుతుంది
పూర్ణ సంగీత రుతాలు ఆమె గొంతులో పలుకుతాయి.
ఆమె నవ్వులో స్వర్గ నిర్ఝరుల కలస్వనం వినిపిస్తుంది
ఆమె అధరాలు పరిపూర్ణాత్మ మధుర పల్లవాధరాలు
ఆమె అవయవాలన్నీ బ్రహ్మానంద స్వర్ణకలశాలు
ఆమె తన నిశ్శబ్ద హృదయంలో ప్రజ్ఞను భరిస్తుంది.
విజేత కరవాలంవంటి మహాశక్తి ఆమె స్వాంతం
ఆమె నేత్రాలు విమల బ్రహ్మానందాన్ని వర్షిస్తాయి.
మృత్యువు ఆసన్నమైనప్పుడు ఒక బీజం నాటబడుతుంది.
స్వర్గంలోని ఒక అంటు భూమిపైన వెలకొంటుంది.

ప్రకృతి ఆమె భౌతికతను అధిగమించి పోతుంది
మారని సంకల్పం విధిని సైతం మార్చివేస్తుంది."

అనంత తేజస్సులో జ్యోతి అంతర్లీనమైనట్లు,
ఔన్నత్యం అంతర్ధానమై. మూలస్థితిలో
అమరమై, శబ్దం నిశ్శబ్దంగా మారింది.
ఒకప్పుడు సన్నిహితమైన ఆనంద ప్రతిధ్వని
మధురంగా, సుదూర నిశ్శబ్దంలోకి పయనించింది.
ధ్యాన స్థితిలో చెవులకు వినిపించని సంగీతంలో,
ఒక రుతాన్ని, సుదూరాన ఉన్న రుతాలు పలకరించాయి
స్వరం, క్రమక్రమంగా నిర్గమించి, నిస్వన మైంది.
ఇంద్రియ లోలత్వాన్ని దాదాపుగా వదలివేసి,
అందనిదని తెలిసీ, స్వగృహంపై మమకారంతో
పృథ్వీ వాంఛించే రూపాన్ని ఆమె వదలివేసింది
అంతరంగం శూన్యమైనా, తేజస్సుతో నిండిపోయింది
అంతా అ-పూర్ణంగావున్న ఆధ్యాత్మిక స్థితులే
అన్నీ ప్రసాద ప్రశాంతి నిండిన నిరుపహతి స్థలాలే
ఆ నిశ్శబ్దం అంచున ఒక రేఖ కదలాడింది
మృదుమధురమైన చైతన్యభావ సాగర తరంగం
కలకలనాదాలతో, కిలకిల స్వనాలతో
ధవళ పదధ్వనులతో దిగివచ్చింది.
నిసర్గ హృదయౌన్నత్యం ప్రకటితమైంది
నిర్గుణ, నిశ్చలన, ప్రశాంత సీమలన్నీ
భౌతిక వాతావరణానికి లోబడిపోయాయి.
సమాధి స్థితిలో కనిపించని స్వర్గధామాలు
మనస్సు మేల్కొనగానే పూర్తిగా కరిగిపోయాయి
అమరత్వం, నిగూఢ, నిశ్శబ్ది, నిద్రావస్థలో
నిర్మల గంభీర ఏకాంత స్థితిలో
కనిపించని కనురెప్పల్ని బరువుగా వాల్చింది.
తేజోమండలాలు నిస్తేజమయినాయి

క్రమంగా అంతరించిపోయే తేజోమండల కాంతులు
రాలిపడే నక్షత్రాలవలె, అతనికి దూరమైనాయి.
వెనువెంటనే భౌతిక శరీరం చైతన్యం పొంది
అతని ఆత్మ వేగంగా శబ్దప్రపంచంలోకి
ప్రాపంచిక కార్యకలాపాలలోకి దిగివచ్చింది.
దేవతలు మాత్రమే అధిరోహించగల రథానికి
తేజో చక్రాలను అమర్చి, స్వర్గ సౌందర్యాలుచూస్తూ
అతను ఆధ్యాత్మిక ద్వారాలు దాటి బయటపడ్డాడు.

భౌతిక సంరంభం తిరిగి అతనిని ఆహ్వానించింది
తిరిగి ప్రాపంచిక రంగంలో సంచరించసాగాడు
ఆ మహోన్నత స్థితిలో అందుకున్న జ్ఞాన శకలాలు
తన ఆలోచనలమధ్య పరిపుష్టమై ప్రకృతిలోతుల్నిశోధించాలన్నతపనతో
నిగూఢ తీరాలకు ఎగిరిపోతుంటాడు.

అతను అనంతకాలగమనంలో చిరపత్యాన్వేషి
అన్ని కాలాలలోను, అంతులేని తపనతో
ఏవేవో సాహస కార్యాలకు పూనుకొంటాడు
నిశీథంలో, అజ్ఞానం నుండి ఒక్కసారిగా మేల్కొని
అసంఖ్యాక తారాసందోహాలను దర్శిస్తాడు
అసంపూర్ణ ప్రవాహంవంటి ప్రశ్నావళిని వింటాడు.
మనస్సును శోధించి, రూపకర్తకై శ్రమిస్తాడు
అతీంద్రియ అగోచర మండలాలలో సంచరిస్తూ
ప్రపంచ పరిధిలో విద్యుక్తధర్మాలను నిర్వహిస్తూ
పశుత్వంలోనే ఉద్దీప్తమైన దివ్యరూపంతో
విజయగర్వంతో స్వర్గంవైపు చూచాడు.

అనంత సాగరాలలోని ఘనశిలాతలంపై
నిలిచినట్లు, పదార్థంపై, పరాపర విశ్వంపై
తన ఆత్మ సామ్రాజ్యాన్ని సుస్థాపితం చేశాడు.
అస్థిరమైన గోళంపైన, సువిశాల క్షేత్రంలో
జీవనకర్తగా సాహసయాత్రలకు ఉపక్రమించాడు. ❊

# శైశవం

సావిత్రి మహాకావ్యంలో అశ్వపతి మహాయోగి - శ్రీ అరవిందుల యోగ విజ్ఞానం యావత్తు అశ్వపతి వరంగా అభివ్యక్తం అయింది. ఈ ప్రపంచం 'పూర్ణం' కావాలన్నది అతని ఆశ, సంకల్పం—సృష్టికి మూలకారణమైన శక్తి 'సావిత్రి' రూపంలో అవతరించాలి — అశ్వపతి కలలపంట సావిత్రి. పోరాటం, విజయం రెండూ సావిత్రిలో కన్పిస్తాయి—

జగన్మాతను గూర్చి తపస్సు చేశాడు. వరం పొందాడు. జగన్మాత సావిత్రి రూపంలో అవతరిస్తానని హామీ యిచ్చింది. సాంకేతికంగా ఒక ప్రళయం ముగిసింది. భూమిపై మూడు ఋతువులు ప్రయాణించసాగాయి. అజ్ఞాన సాగరం అనంత తీరాలను తాకింది. జీవం అస్పష్టంగా కనిపిస్తూ, అంతర్ధానమవుతూ, పునర్దర్శనమిస్తూవుంది. ఋతువులు వస్తున్నాయి, పోతున్నాయి, ఎండాకాలం - వర్షాకాలం - శీతాకాలం.

అశ్వపతి యోగఫలంగా సావిత్రి అవతరించింది. సావిత్రి బాల్యమే ఒక అద్భుతం. ఆమె ప్రపంచంలోవున్నా ఎవరితో కలవదు. ఆమె మానవి అయినా, ఆమెలో వున్నది దివ్యత్వం.

స్పృశించ సాహసం చేయని సహచరిపలె
కాంతిచుట్టూ వాంఛ వలయాలు తిరుగుతుంది
అతిదూరమై అగోచరమైన లక్ష్యంపై పరుగుదీస్తూ
భూమి సూర్యునిచుట్టు అనంతంగా పయనిస్తుంది.

శూన్యం ఊగిసలాటలో సగం మేల్కొన్న మేధ
అజ్ఞానపు ఎడదపైన జీవితాన్ని కలగన్నది
అనంతమైన నిశ్చల ధ్యానసమాధి స్థితిలో
పరిమిత భావ, కార్యప్రపంచాన్ని కన్నది

ఆమెను పరివేష్టించిన విస్తృత ప్రశాంతి వీగి పోయింది
రత్న స్థగిత కాలచక్రానికి, వేగానికి బందీ ఆయి
రోదసిలోని మార్మిక హృదయాన్ని కదిలించింది.

అస్తవ్యస్తంగావున్న తారకల నిశ్చలత్వంలో
ఒకానొక అనావిష్కృత సంఘటనకై యత్నించింది
ఆమె లయ, సుదీర్ఘ కాలచక్రాన్ని నడిపించింది,

ఆ వలయంలో కాషాయ వర్ణంపై అనంత చలనంలో
రంగుల తీగలవలె రోజులు దొర్లిపోసాగాయి
గాలిలో కదలిపోయే అందాల రంగుల హంగులు
ఋతువులతో కలిసిపోయి నర్తించ సాగాయి
ఆ సంబరాలకు సంకేతమే గడిచే వత్సరాలు

అగ్నితప్తమై అలసి సొలసిన వసుధపైన
గ్రీష్మ అపరాహ్ణాలు సెగలను క్రుమ్మరించాయి
తన మహత్తర కాంతిచ్ఛటలను వంపి
వినీలగగనంపై అగ్నులను క్రుమ్మరించాయి.

తర్వాత గ్రీష్మ తాపానికి నెరియవిచ్చిన నేలపైన
ఉష్ణపక్షాలపై ఉప్పెనగా వర్షం కురవ సాగింది
భీభత్సంగా మారిన ఆకాశంలో మెరుపులు మెరిసి
నిర్జీవంగావున్న నేలపై జీవధారలు స్రవించసాగాయి.

ఉరుములతో, మెరుపులతో, చీకట్లు పిండిన నిశిలో
నిద్రిస్తున్న స్వర్గ ద్వారాలను తారకలు రక్షించాయి
తనకు ప్రణయమిత్రుడైన సువర్ణ నేత్రం మండీ
వసుంధర వదనాన్ని మబ్బుతెరలు కప్పివేశాయి.

విప్లవ సేనలు కదన రంగంతో కదలివచ్చినట్లు
మేఘాలు అవంతంగా వసుధను ఆక్రమించ సాగాయి.
ఆకాశ వీధులలో జలప్రళయం హెచ్చరికలు
మేఘ భేరీ వినాదాలు, దేవతల యుద్ధాన్ని ప్రకటించాయి.

పరిపర కల్లోల సాగరాలు పొంగి పొరలినట్లు
వర్షర్తువు నేల వాలుగు చెరగులా విజృంభించింది.
వర్షధారలు ఎక్కుపెట్టిన బాణాలై వాయి.
మెరుపులు అసంఖ్యాకంగా దిక్కుల్ని చీల్చివేశాయి.
శత్రువులు గుడారాల నుండి విరుచుకు పడినట్లు
ఆకాశంలో విశృంఖలంగా విజృంభించాయి.
హోరుగాలులతో వర్షం విపరీతంగా కురవసాగింది.
ఎటు చూచినా భయంకర తుఫానులు, ప్రభంజనాలు,
ఎటు చూచినా ప్రచండమారుతాలు, ప్రళయ ఘోషలు
ఎండిపోయిన భూములపై నీరు వరదలై పారింది.
స్వర్గనీరాలు, పగిలిన బీళ్లను నింపివేశాయి.
ఆ జల ప్రళయం సర్వాన్ని ముంచివేసింది.
ఎటు చూచినా ప్రళయ జలాలు, తుఫాను రోదనలు
పగటి మసక నేలపై చీకటి బరువు పడ్డది
అది భారంగా సాగి ఉదయ సాయంత్రాలను కలిపి
రొంపి, రొంప కలిపి అంధకారాన్ని చేరుకున్నాయి.
పగం చీకటిని పగలు సింగారించుకున్నది.
ఉషస్సనే మసక ఫలకంలో వెలుగు తనదైన
ప్రతిబింబాన్ని చూడగా సగం వెలిగిన నిశి కనిపించింది:
వర్షపాత జల ప్రవాహాల మునిగిపోయిన నేల
చిక్కడగా, చీదరగా, అసహ్యంగా మారింది:
నేలంతా బురద, ఆకాశం ఘనీభవించిన నిశ్చలం
కొన్ని వారాలపాటు సూర్యుడు కనిపించలేదు.
నిశ్చల, నిర్మల వాతావరణంలో సంక్షోభం లేనప్పుడు
రోదించే మేఘాల గుండా ఒక కిరణం ప్రసరించింది.
కన్నీటి చాటున ఒక దరహాసం మెరిసింది.
రావలసిన కాంతి ఒక్కసారిగా రాలేదు.
అది క్షణికమైన ఆశగా, అంతరించి పోయింది.

మరోకమారు జలప్రళయం ముంచుకొచ్చి
సర్వాన్ని ఊడ్చి, నిష్కళంకం చేసివేసింది
ఆపైన, జలప్రవాహాలు క్రమంగా సమసిపోయాయి.
చెట్లు, చేమలు పచ్చపచ్చగా ఊసులాడుకున్నాయి.

ఇప్పుడు భూమి పరిస్థితి మారి హాయిగా విశ్రమించింది.
రోజులు ప్రశాంతంగా తృప్తిగా సాగిపోసాగాయి.
ఆకాశం నిర్మలంగా, నిశ్చింతగా మారిపోయింది,
పవిత్రుని ఆనందంలో భూమి భాగం పంచుకోసాగింది.

భగవంతునికి చేరువవుతున్నప్పటి ప్రశాంతత
అతీంద్రియ తేజస్సు నేలను, నింగిని నింపివేసింది,
ఒకానొక పారవశ్య 'త్వమేవాహ' స్థితి
ధ్యాన స్థితిలో వున్న హృదయాన్ని నింపివేసింది.

శూన్య మూగమేధస్సులో ఒక స్వప్నం కదలాడగా
కాలం తన ఆనంద మందిరాల తలుపులు తెరిచింది.
దానిలోకి ఒక ఔన్నత్యం, ఆశ ప్రవేశించాయి
ఆత్మ ఆంతర్యంలో స్వర్గ శిఖరాలను వెదక సాగింది
ఆలోచన ఆంతర్యంలో గుప్త జ్యోతిని వెలిగించింది.
అంతర్దృష్టి అగోచర దివిని చూడసాగింది.

మూడు ఋతువులు నిండుగా, ఉత్తేజంగా సాగిపోతూ
వాటి వాటి కాలాన్ని సక్రమంగా పంచుకున్నాయి.
వెలుగుల ఆంతర్యంలోని జ్యోతికై నిరీక్షిస్తూ
ఒక మహత్తర జన్మకై ఎదురు చూడసాగాయి.

పండు వెన్నెల పరువాన్ని శరత్తు పండించుకుంది.
జలాశయాలలో పద్మాలు ప్రఫుల్లమైనాయి
హేమంత తుషారాలు శైత్యోపచారాలు చేశాయి.
సగం నిద్రలో మత్తుగావున్న ప్రకృతిని స్పృశించాయి.
ప్రకృతి రామణీయకతలో పులకిస్తూ,
సంవత్సరాలు నిస్తుల సౌందర్యంతో గడచిపోయాయి,

ఉన్మత్త ప్రేమికుని వలె వసంతం అడవులు దాటి
వధువు వసుధను ఆలింగనంలో బంధించింది;
అతని ఆగమనం కనుపాపల మెరిసిన ఇంద్రధనుస్సు
అతని బిగి కౌగిలి ఆనంద పారవశ్యానికి ప్రతీక
అతని పిలుపు అతీంద్రియ స్థితిలో కలిగే స్పందన
అతని స్పర్శ మన భౌతిక జీవితాలను గోప్యంగా,
నిత్య నూతనంగా, చైతన్యంగా మారుస్తుంది,
ప్రాచీన మధురిమకు కొత్తరూపాలను కూరుస్తుంది,
కాలానికి మృత్యువుకు అతీతంగా కాపాడుతుంది.

మన హృదయాలు వాంఛించే ప్రకృతి సౌందర్యాలను
నిత్య నూతనంగా అందించినా, అవి మార్పుచెందవు.
పూర్వపు ఆహ్లాదాన్ని అనవరతం అందిస్తూ.
అందాన్ని, ఆనందాన్ని, పారవశ్యాన్ని శాశ్వతం చేసింది
వసంతుని రాక మహత్తుల్ని, మహదానందాన్ని తెచ్చింది
అతని స్పర్శ, అలసిన జీవితాలు ఆనంద ప్రదాలైనాయి.
ఆనందమే ఆమె హృదయంలో బందీ అయింది.

అతని అనురాగం భౌతిక జీవితానికి అందిన వరం
తనలో నెలకొన్న దివ్యత్వపు మమతతో మారి
అధర స్పర్శతో ఆమె రూపాన్ని సౌందర్య పూర్ణం చేశాడు
ఆ ఆనందాన్ని తనలో ఇముడ్చుకోలేని వసంతం
సముజ్వలంగా నిస్వన విన్యాసాలు చేస్తూవచ్చింది
తరు శిఖరాలపై మయూరాలు పురివిప్పాయి
అతని ఆశ్వాసమే ఆనందానికి సుస్వాగతం
అతని చూపు సోకినంతమేర ఉన్మత్తశ్యామలమే
సునిశితమైన దివ్యలాలస రక్తంలో కలిసి
పరబ్రహ్మానుభూతుల్ని, ఆనందాన్ని కలిగించింది.
అది సౌందర్యంగా భాసించి, సర్వవ్యాప్తమై
జీవితాన్ని సచ్చిదానందపూర్ణం చేసింది.

క్షణికమైన కాలంపై శాశ్వత ముద్రలు వేసింది.
సంకల్పం తీవ్రమై దివ్యపూరితమైనప్పుడు
జీవించడమే మహత్తరానందం అవుతుంది
అన్ని దృశ్యాలు, శబ్దాలు తన్మయం కలిగిస్తాయి.

ఈ మనోహర భూగోళంపై జీవనం మధురం,
కాంతిమయం, రాగపూర్ణం అవుతుంది.
బ్రహ్మానందమయం, వర్ణపూర్ణం అవుతుంది
అదే కిరణతోరణం, రాగసముచ్చయం.
అదే దివ్యసంగీత సుస్వర సమ్మేళనం,
అదే తరుశాఖలపై వినిపించే పత్రగీతం
సుగంధ పరిమళాలతో కాలం నిండిపోయింది.

నిర్మల సంకల్పంలోని పవిత్రతవలె
బొండుమల్లెల వాసనలు పరిమళిస్తాయి
మావిచివుళ్లు మేసినకోకిల, విరహంతో
మధుర గీతాలాలపిస్తుంది, మధుకరుడు
పూలమొగ్గలపై, మధువుకై, వాలుతుంటాడు.
భగవంతుని హిరణ్యమందహాసమే సూర్యకాంతి,
ఆ వెలుగులో ప్రకృతి సమస్తం సుందర ఉత్సవమే.

ఆ మహత్తరమైన దివ్య ముహూర్తంలో
భూమి ఆరాటానికి బ్రహ్మానందాభిలాషకు
సమాధానం పరలోకాలనుండి దిగివచ్చింది.

ప్రాపంచిక శబ్దప్రపంచంలోని నిశ్శబ్దం
తానే పరమపదంగా అభివ్యక్తమైంది
జడంగా వున్న నేలపై మహాశక్తి ఆవిర్భవించింది.
ఒక జ్యోతి వెలిగి, పవిత్రరూపం ఏర్పడ్డది.
మానవ మేధస్సుకు భగవంతునికి మధ్య అగాధానికి
వారధిగా, ఒక తేజోకిరణం నేలను స్పృశించింది

అది స్వర్గాన్ని మానవరూపంగా మార్చింది
ఆ తేజస్సు మన అజ్ఞానాన్ని అగోచరంతో కలిపింది.

దివ్యత్వానికి మూలకారణమైన మహాశక్తి
ఈ అసమగ్ర ప్రపంచంలో అవతరించినా,
అశాశ్వతత్వంలో పతనమైనందుకు దుఃఖించక
అన్నింటినీ పవిత్రదృష్టితో చూడసాగింది.

అతీంద్రియ మండలాలనుండి తిరిగివచ్చినవారు
ప్రాపంచిక భారాల్ని సరికొత్తగా వహించక తప్పదు.
వారు ఈ బాధల్ని, చీకట్లను అనుభవించి అలసిపోయినవారే!

ఆమె తిరిగి అసంపూర్ణ దివ్య కార్యనిర్వహణ కుపక్రమించింది.
కోట్ల సంవత్సరాల కాలాన్ని, మృత్యువును దాటివచ్చి
ఆమె హృదయపూర్వకంగా కాలాన్ని ఎదుర్కొంటుంది.

అది తిరిగి నవనవోన్మేషంగా వికసితమైనా
సనాతన సాన్నిహిత్యాన్ని ప్రపంచమాయ క్రమ్మివేసింది
ఆ రహస్యబంధాన్ని కాలం త్రుంచివేసింది
అది భూమికి-స్వర్గానికి గల సంబంధం

ఇక్కడ మానవపరిధిలో పరిశ్రమించే శక్తికి
ఉద్భవించవలసిన అఖండశక్తికి మధ్య సంబంధం అది.
మరొకమారు మార్మిక ప్రయత్నం పూర్ణంగా జరిగింది
ఈ విశ్వక్రీడలో అదిఒక సాహసోపేతమైన చర్య.

అంధకారంలో బొంగరంలా తిరిగే భూగోళంపైన
ప్రకాశమాన మేధస్సుతో భూచరం కదలాడినప్పుడు
జీవం భౌతికపొరపైన దండెత్తింది
అనుభూతి అజ్ఞానాన్ని త్రోసివేసింది.

అనంత నిశ్శబ్దంలో శబ్దం ప్రభవించినప్పుడు
ప్రకృతి గుండెపై జగన్మాత పరిశ్రమించి
శ్రమించే హృదయాలకు ఆనందం పంచియిచ్చింది.

చంచల జీవనశక్తులపై సంపూర్ణత్వాన్ని ముద్రించింది.
ప్రచ్ఛన్నంగావున్న అగాధాలపై దివ్యత్వాన్ని దిద్ది
జడపదార్థానికి భగవత్ స్పృహ కలిగించింది.

పతనమైన మన మేధస్సులు ప్రగతిని విస్మరించినా
మన మానవశరీరాలు నిరోధించి, విఫలమైనా
భూమిని స్వర్గం చేయాలన్న ఆమెసంకల్పం మారదు,
అపజయ వైఫల్యాలవల్ల నిరాశ ఏర్పడదు.
కాలహరణంవల్ల ఆమెహృదయం శూన్యం అవదు.
యుగాలుగడచినా ఆమెలక్ష్యం కుంటువడదు.
విధి, మృత్యువుల విజయాన్ని ఆమె ఆమోదించదు.

ఆత్మల్ని ఆమె కొత్త ప్రయత్నాలకు ప్రోత్సహిస్తుంది
నిస్తులంగా, నిస్తేజంగావున్న గుప్తశక్తుల్ని
ఆమె అనంత అద్భుతమహత్తు ఉత్సహిస్తుంది.

అనంతత్వం సర్వం వృధా చేయడానికైనా సిద్ధమై
సగం జీవం పొందిన, ఊసరక్షేత్రంలో
ఆమె పరబ్రహ్మశక్తి బీజాన్ని వెదచల్లింది
సారస్వత హృదయంలో దివ్యానందం నాటింది
మృగప్రాయమైన రూపంలో దివ్యత్వం నింపింది
మృత్యువు ముసుగులో అమరత్వాన్ని దాచింది
మరొకమారు దివ్యసంకల్పం భౌతికరూపం దాల్చింది.

అచంచల సత్య భూమికనుండి శక్తిని గ్రహించిన మేధ
భావ చిత్రాలను రూపొందించి, జ్యోస్నముఖమై
ప్రాపంచిక సంకేతాలలో 'దివ్య' ప్రదర్శనకు
తదనుకూలంగా శరీరాలను ఆయత్త పరచింది
ఈ వినూత్న అవతరణ ఏర్పరచిన వత్తిడి వలన
భూమికి తెలియని సుందర రూపం ఒకటి ఏర్పడ్డది
అది ఒక సూచికవలె, భవిష్య సంకేతం వలె
అగోచర సంపూర్ణత్వం యొక్క వెలుగురేఖవలె

మసక మసక వెలుగు ప్రసరించిన సాయంతనంలో
సువర్ణ శీతాంశుని నెలవంక వలె ప్రకాశిస్తూ
అది భౌతిక జీవనాకాశంలో ప్రవేశించింది.

అది తొలుత రూపంలేని భావంవలె కదలాడి
నిశ్శబ్దంలో మగతగా నిద్రించ సాగింది.
అది భయంకర భౌతిక సమాధిలో మునిగి
విశ్వప్రణాళిక హృదయ కుహరంలో బీజంగా
గ్రహ గోళాలు విశ్వ పారవశ్యంలో
అచేతన దివ్యత్వంలో ఊయల లూగింది.
సాక్షికంగా జాగృతమైన నిర్మాణంలోని నిర్దేశ శక్తి
మహత్వ బీజాన్ని, మూగగా, అందుకై ఏర్పడిన
ఈ విచిత్ర అతీంద్రియకతలో నాటింది.
వెంటనే ఆత్మకు రూపంతో సంబంధం ఏర్పడ్డది
చీకటి గుహ దివ్యతేజస్సులతో నిండిపోయింది
ఆ చిరు బీజం మహత్తరమైన మొగ్గగా పరిణమించింది
ఆ మొగ్గ అద్భుత స్వర్గసౌరభాలను విరజిమ్మింది
అప్పుడే శక్తివంతమైన జాతిని ఆమె చూచినట్లయింది.

ఈ చిత్రమైన భూగోళంపైన అవతరించిన ఓ శిశువు
అస్పష్టంగా, దూరానఉన్న తన స్వస్థానాన్ని స్మరిస్తూ
తేజోవంతమైన తన ఆత్మమందిరంలో సురక్షితంగా
తనవారైన దివ్యపురుషులమధ్య మెలగసాగింది.

ఆమె బాల్యచేష్టలలోనే భూమికి దూరంగా
ఉన్న తేజస్సుకు దగ్గరవుతున్న ఛాయలు కన్పించాయి.
అమరత్వాన్ని పంచుకోగల లక్షణాలు కన్పించాయి
దేవతాసహజమైన భావనలు ప్రబుద్ధమైనాయి.

తన బ్రహ్మానందస్థితి తప్ప ఏమీ అవసరంలేదు,
ఆమె సహజంగా మనజాలిన లోకమే వేరు

గుప్తఫలభరితమైన కొమ్మలపైన తిరుగుతూ,
విశాలహృదయంతో తిరిగే అపూర్వశాబకంవలె
వనసౌందర్యాలతో పరవశించిపోతుంది,
లేదా, అందని దివ్యశిఖరాలపైకి ఎగిరిపోయింది.

ఆమె భూమిని స్వర్గంతో ప్రభావితం చేసింది.
ఆమె బాల్యం ఆటలతో, పాటలతో, ఆనంద
పారవశ్యంలో ఉజ్వలంగా గడిచిపోయింది
ప్రతిక్షణం ఆమె హృదయాన్ని సౌందర్యంతో నింపింది
ఘడియలు, రోజులు మధురగీతాలుగా మారాయి.
ఆమె ఏదీకావాలని వాంఛించలేదు, అందిన ఫలాన్ని
ప్రకృతి ప్రసాదంగా, తృప్తిగా అనుభవించింది
ఆమె ఆత్మశక్తి, ఆదిసవిత్రుని తేజస్సుకు సామీప్యం
ఆమె ఆత్మానందం, అనంత బ్రహ్మానందంలోనిదే.

ప్రకృతినుండి వేరైన ఆమె తొలి జీవనసౌరభం
బ్రహ్మానందంలో ఆకాశమంత ఎత్తుకు చేరింది
జీవనలాలసలోనే సంపూర్ణంగా జీవించి
ఆత్మతృప్తితో, అన్నింటినీ అందుకుంది.
ఆ ఆనందానికి తనలోకంతో సంబంధంలేదు
పరిసర ప్రపంచంతో అనుబంధమూ లేదు.
ఏ ఆదరువు, ఆధారం, రూపం అవసరంలేని
నిగూఢమైన, అతీంద్రియ పూర్ణత్వంఅది.

ఉన్నదానితో సమంగా అదీ పెంపొందుతుంది
అన్నిప్రసాదనాలు ధ్యానంలో లయించిపోతాయి
చిరుగాలితరకలకే ఆనందం వెల్లివిరుస్తుంది
ఉష్ణాన్ని, శైత్యాన్ని సమంగా ఆమోదిస్తుంది
ఆకులచలనంలోనే అద్భుత పారవశ్యం
పూలనెత్తావులలో నిసర్గ మధురిమలు
కొమ్మలలో, రెమ్మలలో ఆనంద నిష్యందాలు.

ఈ సౌందర్యానికి కారణమైన అదృశ్య దివ్యత్వం
ఈ ఆకర్షణకు ఆస్పదమైన ఆత్మీయశక్తి
ఈ మాధుర్యానికి అధిదేవత, స్వప్న సంగీత-
అగోచరంగా, ఇంద్రియ లోలత్వంనుండి,
మన జీవితాలను రక్షించి, తేజస్సులో ముంచి
మహోక రకమైన కల్లోల వాతావరణాన్ని చవిచూచి,
మాత్మిక జలాలలో సుస్మాతఅయి చలించిపోయింది
ఆ దివ్య ఔన్నత్యం ఆమెలో దర్శనీయమైంది.

ఆమె భౌతికపరమైన సుఖాలను అనుభవించినా
ఆమెఆత్మ దివ్యస్థితినుండి దిగిరావడంలేదు.
దిగివచ్చినా, ప్రాపంచికతలో తననుతాను విస్మరించదు,
ఆమెమేధస్సులో లోకమే మారి కొత్తరూపం ధరించింది
కల్పనలు చిత్రవిచిత్ర రూపాల్ని ధరిస్తాయి
ఆ కలలు ఆధ్యాత్మిక సంపదల్ని నింపుకుని
ఆమె సువర్ణమందిరంలో ఆరాధ్యదేవత అయింది.
కళ్లతో మనం చూడలేని రూపాలను దర్శిస్తూ
మనం పొందలేని అనుభూతులకు తాను చేరువై
ఆమెఆత్మశక్తి, ఆశించిన రూపాల్ని ఆవిష్కరించింది
ఆ రూపాలను మనం బాహ్యప్రజ్ఞతో దర్శించలేం

ఆమెనరాలలో అగోచర సూర్యకాంతి ప్రవహించింది
ఆమె మేధస్సు దివ్యచ్ఛటలతో నిండిపోయింది.
ప్రపంచం తెలుసుకోలేని దివ్యదృష్టి ఏర్పడింది.
ఆ మహత్తర కాంతికిరణం ప్రవహించిన చోట్ల
ఆమె పసిభావాలన్నీ పసిడిభావాలైనాయి
ఆమె హృదయాంతర్గత సత్యదీపికలైనాయి.
ఆమె కళ్ళనుండి మహోకవెలుగు ప్రవర్తించి
మనిషి అజ్ఞానం గుర్తించని కాంతిని ప్రసరింపించింది
ఆమెదృష్టిలో జీవులందరూ ఆత్మస్వరూపులే

చైతన్యం పొందిన ప్రతి బాహ్యవిషయంనుండి
ఆమెహృదయం ఒక సందేశాన్ని అందుకోగలిగింది.
సాక్షికంగా అవగాహన అయ్యే అనంతచక్రంలో
ప్రతిదీ శక్తికి సంకేతమే, ప్రతిదీ ఒక దివ్యతేజస్సే.
అందులో ఏదీ జడం కాదు, ఏదీ ప్రతికూలం కాదు
ఏదీ అర్థరహితంకాదు, ఏదీ నిరర్థకంకాదు.
ఆమె తానే పరప్రకృతిగా మారింది.
నేలనుండి చెట్టు, చేప ఆకృతించినట్లు
జంతుజాలంనుండి బుద్ధిమానిసి తయారైనట్లు
ఆమెలో ఒక సరికొత్త రూపం ఏర్పడ్డది
ఒక కాంతి మేధస్సు, ఒక జీవనశక్తి
నిగూఢ అమృతత్వం నిండిన శరీరస్పృహ
రానున్న దేవతకు రూపాన్ని సిద్ధంచేసింది.

రోజులు నెమ్మదిగా సాగి, సాగి, వసంతాలు గడిచాయి
వసంతాలు పూర్ణశోభలతో పులకించసాగాయి
ఆమె అందచందాలన్నీ మధురిమలతో నిండిపోయాయి
ఆమె సౌందర్యం శరత్పూర్ణిమా చంద్రిక అయింది
ఆమె గంభీర ప్రశాంతతే ఆమెకు రక్షకవచం
ఏకాంతంలోని మహత్తు అల్పాల్పం కాదు.
వినీల ప్రశాంత ఏకాంత గగనంలోకి
నక్షత్రసముదాయాన్ని దాటి బాలభాస్కరుడు
చేరుకున్నట్లు దివ్యత్వం పైకివచ్చింది.
అది మానవరంగాన్ని ఆక్రమించవచ్చింది.

ఆమె జీవనరంగాన్ని పరమాత్మ గమనిస్తూ వుంది
దివ్యతేజస్సు ఆమె ఆత్మగా వెలగసాగింది
ఆమెచూపులో కమనీయ రాగాలు రవళించాయి,
మార్మికదేవాలయంలో వెలిగే జ్యోతులవలె
ఆమెనేత్రాలు, అద్భుత తేజస్సుతో వెలిగాయి
అవి మానవతలో దివ్యత్వాన్ని రగిలించే అగ్నులు.

ఆమె నిర్మల నేత్రాంచలాలు దాటివచ్చిన వెలుగులు
జీవితానికి మహత్తర లక్ష్యాన్ని అందించాయి
ఆమె విశాల ఫాలభాగంపై భాసించే స్ఫూర్తి
కనుబొమలలో అద్భుతశక్తిని సమీకరించి
ప్రాపంచిక విషయాలపై ప్రజ్ఞను ప్రసరించింది.
కోటబురుజునుండి వినిపించే విజయగీతంవలె
ఆమెలక్ష్యం, ఉన్నతాదర్శాన్ని కొనితెచ్చింది
ఆమెశక్తి నగరులో చరించే నిశ్శబ్దయోధుడు
అచంచలంగా, సత్యఖచిత సింహాసనాన్ని రక్షించాడు
ఆమె హృదయంలోని అమృత చంద్రవలయం
అందర్నీ ప్రేమిస్తుంది, కానీ ఎవరితో మాట్లాడదు
తన హృదయంలోని బ్రహ్మానంద రహస్యాన్ని
ప్రపంచంలో నిశ్శబ్దానికి పరిమితం చేసుకుంది.
ఆమె జీవనకెరటం వేగంగా, ఆనందమయంగా
స్వర్గవాహినివలె, ఆమెలో, ప్రవహించింది.
ఎందరో దేవతలు సుందరమందిరంలో కొలువైనారు
అయినా ఆమెస్వభావం వినిర్మలం, సంపూర్ణం.
అది అనేకానేక రాగాల సమ్మోహన స్వరమేళ
అది విస్తృతం, విశ్వంవలె మహత్వపూర్ణం.
ఈ అనంతమహత్వాన్ని భరిస్తున్న చిన్నిశరీరం
దివ్యస్వర్ణకాంతితో తయారైన మహత్తరరూపం
అది స్వాప్నిక దృశ్యాలకు కమనీయ రూపకల్పన
అది దివ్య ప్రవాహాలపై నిర్మితమైన వారధి
అది అనంతప్రశాంతికి అనుంగునెచ్చెలి
సరోవరతీరంలో ఒంటిగా నిలిచిన ఖర్జూరం.
నందనవనంలోని ఆకుల మర్మరధ్వని
దేవతలు ప్రశాంతంగా నడయాడే పదసవ్వడి
నిద్రిస్తున్న పర్వతశ్రేణులపై పరచుకున్న ప్రశాంతి
అది నిశీథంలో తారకల నిర్మలసామ్రాజ్యం.

# కౌమారం

సావిత్రి బాల్యంగురించిన విశేషం లేదు - బాల్యం గడిచింది. ఆమె యవ్వనంలో అడుగుపెట్టింది - అంతవరకు ఆమెప్రవర్తన సామాన్యంగానే కనిపిస్తుంది - సావిత్రి రాజకుమారి - ఆమెతండ్రి అశ్వపతి. మద్రదేశానికి అధిపతి - అది యోగసామ్రాజ్యం. అది తపస్సమాధిలో అంద చందాలకు ఆకరం. సావిత్రిలో మానసిక, ఆధ్యాత్మిక పరిణతులు కనిపిస్తాయి. ఆమె సర్వకళాప్రపూర్ణ - షోడశకళలు ఆమెవి. చతుష్షష్టికళలలో ఆమె నిష్ణాతురాలు - కానీ వాటితో ఆమెకు తృప్తి కలుగలేదు. ఇంకేదో ఆశించింది - జ్ఞానాన్ని మించిన జ్ఞానం కావాలనుకున్నది.

సావిత్రి బాల్యంలో స్నేహాన్ని వాంఛించింది - అందరిలోను తనను, తన ఆత్మనే చూచుకోసాగింది - అందరినీ ప్రేమించసాగింది. అందరు తనను ప్రేమిస్తున్నా, సావిత్రి తన ఆత్మలోకాలలోనే విహరించింది. తన హృదయతంత్రులనే విన్నది - ఆమె సౌందర్యం గురించి పురుష ప్రపంచం చెప్పుకోసాగింది-ఆమెను దేవతవలె యువకులు ఆరాధించసాగారు, అభిమానించసాగారు - కాని ఎవరికీ ఆమెను ప్రేమించే ధైర్యం లేదు. పెండ్లాడే సాహసం లేదు. అయినా అందరిమధ్య ఉన్నది. తన అదృష్టం అంది వచ్చేవరకు—

కొండలలో, కోవలలో, సారసక్షేత్రాలలో
సాగర సంగమానికై పరుగులెత్తే నదులు
సృష్టికి ఆధారం, ఆధ్యాత్మిక ఆవాసం
అతీంద్రియ జ్ఞానంతో స్వర్గంవైపు పరుగు
స్వప్నంలో, సమాధిలో విస్తరించే ప్రపంచం
భగవంతుని మహత్తర లీలలు, మనిషికోసం,

ఈ ప్రకృతి, పరమాత్మ కన్న ఒక కల,
అందులో అందాలు, ఆకర్షణలు, మహత్తులు ఉన్నాయి.
అవతరించిన సావిత్రి బాల్యంలోని అనుభవాలు.

ఆమెపై కోటికోట్ల ప్రభల ప్రభావాలు
గతంలోని దివ్య మహత్తులు ఆమెచుట్టు,
అవతరించే దివ్యత్వానికి ఆమె ప్రేరణ
అగోచరశక్తులన్నీ ఆమె అందిపుచ్చుకుంది.
ఆమె నిశ్చలహృదయంలో విశ్వవిజ్ఞానం ఉంది
మేధోశిఖరాలనుండి దేవతలను చేరే ప్రయత్నం
అందుకు భౌతికమైన భావనలు ఆధారాలు
విశాలరోదసిలోకి చేరాలన్న ప్రయత్నం
భావుకుని ప్రజ్ఞ, ఋషి ఉపజ్ఞ
అగోచరాన్ని దర్శించి, అనూహ్యాన్ని భావించింది
అగోచరలోకాల విశాల కవాటాలను తెరచి
మానవపరిధుల్ని అనంతంలోకి సారించింది.

మనిషిచేసే పనులకు అంతం అంటూ లేదు
మనిషి హృదయంనుండి, కళాసౌందర్యాలు పెల్లుబికాయి
ఆత్మప్రకృతి దివ్యత్వంలో ఏకమైంది.

మనిషి నైతికంగా స్వర్గాన్ని అనుసరించాడు
మహోన్నత సంస్కారంతో వివేకాన్ని సమన్వయించి
వినిపించనిది వినేటట్లు, అగోచరాన్ని చూచేటట్లు
తెలియని విషయాలను ఆత్మ తెలుసుకోగలిగేటట్లు
జీవుడు బంధాలను త్రెంచుకుని, విముక్తుడయ్యేటట్లు
పరమాత్మ అదృశ్య ప్రపంచాన్ని ఆశించేటట్లు చేస్తుంది.

సురక్షితమైన ప్రపంచాన్ని వదలిన మనసు రెక్కలు విప్పి
భావాంబరాలలో యథేచ్ఛగా విహరిస్తుంది.
ఇహ పర లోకాలకు మధ్యగల మార్మిక సంద్రాలు దాటి
సూర్యమండలం చేరువుగా జీవి పోగలుగుతుంది.

అక్కడ వివేకం ఉన్నతాపనంపై అధిష్ఠిస్తుంది
ఆమెకు ప్రియాతిప్రియమైన రహస్యశక్తుల్ని
సంకేతద్వారాలద్వారా జీవితంలోకి మళ్లించింది
సత్యసమాహారం, బ్రహ్మానందస్థితిలో
ప్రకృతి విద్యాలయంలో, మార్మిక శిక్షణలో
సృష్టిలోని వస్తుచయ అద్భుతాల్ని గమనించి,
తన హృదయంలో నిక్షిప్తమైన రహస్యాలను
అద్భుతవేదికపైన మగ్నం చేసింది
కాలానికి కట్టుపడనివి ఆమె దినచర్యలు
ఆమెచర్యలు త్యాగానికి సంక్షిప్త సంకేతాలు.
ఉన్నతలోకాలతో ఏర్పడిన అనుబంధం
బందీఅయిన ఆత్మవిముక్తం కావడానికి
దేవతామూర్తులతో అనుబంధం ఏర్పడడానికి
మంత్రం ఒక మార్గం, సాధన అవుతున్నది.
సరికొత్త రూపాన్ని ఆవిష్కరించడానికి
జీవునిహృదయం సదా పరిశ్రమిస్తున్నది

చరాచరాలతో అనాదిగా చరిస్తున్న ఆత్మ
జన్మరహితుడు, అగోచరుడు అయిన పరమాత్మ
కోసం, అగోచరమైన వెలుగులో అన్వేషించి
గతించిన రహస్యాలపై ముసుగు తొలగిస్తుంది
తత్త్వసిద్ధాంతాలన్నీ స్వర్గానికి మార్గాలే
సువిశాల రోదసిలో పయనానికి సోపానాలే
మానవమేధను దివ్యమేధగా మార్చే పరికరాలే;

బాహ్యచక్షువులను రంజింపచేసే రేఖల తర్వాత
అంతరంలోవుండే దృష్టి దాగివుంటుంది
ఒక శిల్పంపైన, చిత్రంపైన లగ్నమైన మనస్సు
అంతరంగిక చిత్రంపై స్థిరంగా కేంద్రీకృతమవుతుంది
అది అగోచరంగా నున్న మూర్తిని చూపిస్తుంది

ప్రకృతిలక్ష్యం యావత్తు ఒకేరూపంలో గోచరిస్తుంది
పమస్తము ఒకేఒక దివ్యమూర్తిలో భాసిస్తుంది.

ఆ పరమేశ్వరుని మహత్తర విశ్వశిల్పసంపద
దృష్టి అంతర్ముఖమైనప్పుడు రూపం ధరించి
ఒకానొక శిలాశిల్పంవలె దర్శనమిస్తుంది
అప్పుడు వినిపించే సంగీతం, అమృతవర్షంకాగా
హృదయం బ్రహ్మానందంలో మునిగిపోతుంది.
మానవాక్రందన విశ్వఘోషగా వినిపిస్తుంది.

తాండవనర్తనంలో ప్రపంచ చలనాలు
భావం, రాగం, తానంగా, ముద్రలుగా మారి
అతిసూక్ష్మ, సుస్మిత రేఖలై, అను గీతలై
స్మృతిపథంలో క్షణకాలం శాశ్వతాలై
ఒక రూపాన్ని, భావాన్ని పమాయత్త పరుస్తాయి.
అవి అదృశ్యంగానున్న విశిష్టరూపాలు.
ఆ గీతాలు మహత్తర చలిత ప్రపంచాలు
చందస్సులు ఆక్రోశించే సాగర నాదాలు
అవి ప్రకృతిహృదయంలో దాగిన సౌందర్యాలు
ఇప్పుడవి భాషతో బంధించదగిన చందాలు
ఆ రూపాల అందాలు, అలంకారాలు నిష్యందాలు
ఆమెభావాలు, భావప్రస్థారాలు, స్పందనలు
మనిషికి దేవతలకు చేరువగా తీసుకుపోగలవు.

మనిషి నేత్రాలు అంతర్లోకాలలోకి చూడగలవు
అతని పరిశీలన గణితసూత్రాన్ని విశ్లేషించగలదు
గ్రహగతులను, చలనాలను క్రమబద్ధం చేయగలదు
కమపించే ప్రపంచాన్ని రూపుదిద్దగలదు
తన మనోభావాలను చైతన్యం విమర్శించి, మేధను
జీవితాన్ని సిద్ధాంతబద్ధం చేయగలదు.
ఈ విషయాలను ఆమె పహజంగా జీర్ణించుకుంది

అవిమాత్రమే ఆమె ఆత్మకు తృప్తినివ్వలేదు
విజయాలు మనిషిలక్ష్యాన్ని పరిమితం చేస్తాయి
అవి ఆమెకు మహత్తరమైన తొలి విజయాలు
ఆత్మతరుణ పరిశోధనలోని అవరోధం
తనదైన వెలుగులో చూడడం సాధ్యపడదు
లోకంలో అనేకానేక పరీక్షలు ఎదురై
సత్యశోధనలో మేధ రాటు తేలుతుంది.
అన్నివైపులకు అసంఖ్యాకంగా విస్తరిస్తుంది
కాని ఆత్మకు విశాల దృక్పథం అలవడదు
ప్రత్యక్షానుభూతి వెంటనే సాధ్యపడదు
దేవతల ప్రజ్ఞాప్రాభవాలు కనిపించవు.

మనిషి ఆలోచనను మించిన అపరిమిత ప్రజ్ఞ
హృదయానికి, అనుభూతికి అందని ఆనందం
లోకంలోవున్నది; అది విముక్తిని వాంఛించటం
ఆమె తనుగా గ్రహించింది; అది రూపాన్ని ధరించాలి.
పరిసరాలను ఆధారం కొరకు అర్థించింది.

తనను భరించమని ప్రకృతిని ప్రార్థించింది
ఆమెకు సహజంగా సంక్రమించిన రాజసం, ఠీవి,
ఆమె ఔన్నత్యం, మాధుర్యం, మహదానందం
ప్రేమించగల విశాలత్వం, ఆమె మహత్తరశక్తి,
అన్నింటితో స్వర్గాన్ని జయించడానికి భూమిక అయింది
ఆత్మ స్వర్గం సరిహద్దుల్ని సైతం దాటిపోయింది
పరమాత్మ నుండి ప్రసరించే వెలుగును చూచింది
అతీంద్రియ రంగాన్ని తనకై కలగన్నది.

అన్నింటిలోను ఉన్న విశ్వాత్మను గమనించి, ఆమె
సజీవహృదయాలవైపు, మానవరూపాలవైపు మళ్ళింది
ఆమె ఆత్మానుభూతులు, ప్రతిరూపాలు, సంభావనలు
ఆమె మనుగడకు అతి సన్నిహితంగావుండే విషయాలు

మనస్సు, శరీరం అనే కుడ్యాలను వేరుపరచింది.
కాని ఆమె ఆత్మ దివ్యత్వంతో బంధించబడింది.

అదృశ్య అవరోధాలను, మాయాకవచాన్ని అధిగమించి
ఆత్మను- ఆత్మనుండి వేరుపరచే ఒంటరితనం వదలి
అన్నింటిని ఏకంచేయాలన్న సంకల్పం కలిగింది
ఆ ఏకత్వంలో సకల జీవజాలాన్ని సమైక్యపరచి
వెలుగును దర్శించగల 'బిందువు'లోకి చేర్చి
భిన్నత్వంలోవున్న అంధకారప్రవృత్తిని దాటి
అన్నింటినీ పరమాత్మలో, జగన్మాతలో ఏకంచేస్తుంది.

కొద్దిమందిమాత్రమే ఆమె పిలుపును అందుకున్నారు
కొందరుమాత్రమే తెరవెనుక దివ్యత్వం చూచారు
ఆమె అంత ఎత్తులకు ఎదిగిన మిత్రులు
ఆ దివ్యత్వాన్ని తామూ చేరుకోవాలనుకున్నారు.
ఆ తేజోమయ రహస్యాలను తెలుసుకున్నవారు
పరంలోని ఔన్నత్యాలను గ్రహించగలవారు
క్షణమాత్రపు వెలుగులో ఆమెను దర్శించారు
అనంతంవరకు విస్తరించిన వెలుగును దర్శించినవారు
ఆ వెలుగును, శక్తిని తమలో నిలుపుకొనలేక
తిరిగి నిస్సారజీవితంలో పడిపోతుంటారు.

సాహసంతో దివ్యప్రయోగం చేయగల మనస్సు,
దివ్యత్వం పెంపొందినకొద్దీ మనిషికి దగ్గరవుతుంది
అగోచరపుటంచుల్ని ఆత్రంగా అందుకున్నా
భౌతిక సుఖాలలో వారు బందీలై పోతుంటారు
ఆమెతో పోటీగా అశ్రమంగా వారు పరుగు తీయలేరు
ఆమె సంకల్ప ఆవేగానికి వారు తట్టుకోలేరు
జన్మించని బ్రహ్మత్వం వారి దృష్టికి ఆనదు
మహత్తర విషయాలతో వారు అలసిపోతుంటారు.

ఆమె భావాలతో సన్నిహితంగా మెలగినవారు
ఆమె కాంతికిరణం సమీపంగా చేరుకోలేక
ఆమెలో కనిపించే శక్తిని, కాంతిని మాత్రం ఆరాధించి
ఆమె ఆత్మ ఔన్నత్యం అందుకోవాలని యత్నించరు
ఎంత స్నేహంచేసినా ఆమె అంతర్యం పూర్తిగా అర్థంకాదు
వారి ముందరనే ఆమె ఉన్నత తేజస్సులోకి పయనిస్తుంది
ఆమె వారి ఆత్మలకు, హృదయాలకు నాయకురాలు
వారి హృదయాలకు సన్నిహితమేకానీ ఆమె అతిదూరం
ఆమె నడకను ఆరాధనతో, ఆశ్చర్యంతో గమనిస్తారు
ఆమె దేవతావేగంతో పరుగులెత్తుతుంది
ఆ శిఖరాలు, మానవ స్వభావానికి అందనివి
అనేక విధాల, నెమ్మదిగా పరిశ్రమిస్తూ
అనూహ్య లక్ష్యాలవేపు కదులుతూ ఉంటారు.

అయినా, ఆమె తేజోమండలానికి వారు ఉపగ్రహాలే
ఆమె వెలుగును వదలుకొనడం వారికి సాధ్యంకాదు
చేతులుచాపి ఆమెను అందుకోవాలని ప్రయత్నం,
ఆమె నడచివెళ్ళిన బాటలలో నడవాలని అభిలాష.

ప్రాపంచికమైన సుఖ భోగాలు వాంఛిస్తూనే
మానసిక తృప్తికోసం, ఆమెను అంటిపెట్టుకొని ఉంటారు
మిగిలిన దేదీ వారు కనిపించే వెలుగులో చూడలేరు
ఆమె అంతర్శక్తులనుమాత్రం లీలగా భరిస్తారు.

హృదయంతో, ఇంద్రియాలతో బంధించినా
మానవ సహజమైన ప్రేమతో ఆరాధిస్తూ
ఆమె మహోన్నత వ్యక్తిత్వాన్ని అందుకోలేరు,
సన్నిహితమైనా, ఆమెవలె వారు మారలేరు.

కొందరు ఆమెను ఆత్మలో సన్నిహితంగా చూడగలరు
ఆమె మహత్తు అందీ, మనస్సుకు అందనంత దూరం
ఆమెను దర్శించడమే, ఆమె ఆరాధనకు అనుశాసనం

ఆమె చేరువగా నిలవడమే, మహాశక్తిని పొందడం,
తెలుసుకోలేనంత ఉన్నతుడై భగవంతుని మనిషి ఆరాధిస్తాడు
ఆదిమధ్యాంతరహితుడైన పరబ్రహ్మనే ఆశిస్తాడు
ఆతని మహత్తరశక్తిని భావించి, దర్శనం పొందినట్లు
తన హృదయాన్ని బ్రహ్మానందంతో నింపుకుంటాడు,
ఆ దివ్యత్వానికై హృదయం ఆవేగ పడుతుంది
దివ్యత్వంతో జీవితం, హృదయం విశాలమవుతాయి.

ఆ దివ్యస్పందనతో జీవితం గుబాళిస్తుంది.
మనిషికి సుఖమయ, స్వతంత్రలోకం కనిపిస్తుంది.
ఆత్మవైపుగా, వెలుగువైపుగా ఉన్నతసోపానాలు కనిపిస్తాయి.
ఆమె దివ్యశరీరాన్ని ఆత్మ అందుకోగలుగుతుంది.

ఆత్మ ఆ దివ్యమూర్తిని చూచి, స్పందించగలదు.
వారి సహజక్రియలకు దివ్యశక్తి సహకరిస్తుంది
వారి హృదయాలు ఆమె మధురిమలతో నిండిపోతాయి
తమను మించిపోయిన ఆమె వ్యక్తిత్వాన్ని వాంఛిస్తారు
ఆమెను చేరలేకపోయినా, ఆమె స్పర్శ వారికి కావాలి
సూర్యరశ్మికి వికసించే పుష్పంవలె,
వారు ఆత్మసమర్పణ చేసుకొనీ, ప్రతిఫలం ఆశించరు.

ఆమె తమను మించిన వ్యక్తి, మానవజాతికే మణి
ఆమెను అర్థంచేసుకుని, తెలుసుకునే శక్తి వారికి లేదు
ఆమె శాసించినట్లు వారు మసలుకుంటారు
ఆమెను దేవతగా భావించి, శిరసా వహిస్తారు
ఆమె ఆజ్ఞమేరకు, లోకంలో పనిచేస్తారు
వారి జీవితాలు, ప్రవృత్తులు ఆమెకు అనుకూలమే.
తమ జీవనసత్యాలన్నీ, దివ్యభాగలైనట్లు,
తమను ప్రాపంచికత నుంచి ఆమె ఉద్ధరించాలని ఆశిస్తారు.

ఉజ్వలమైన భవిష్యత్తు కనిపించసాగింది.

ఆమె వారికి చేయూతనిచ్చి మార్గాన్ని చూపించింది
అగోచర పథాలలో ఆమె వెన్నంటి నడవసాగారు
విశ్వాసం ఊపిరికాగా, వారికి ఆనందం ఏర్పడ్డది
ఆమెలో తామై జీవించి, ఆమెకనులలో విశ్వాన్ని దర్శించారు.

స్వభావానికి విరుద్ధంగా కొందరు ఆమెను ఆశ్రయించారు,
ఆశ్చర్యానికి, ప్రతిఘటనకు మధ్య విడిపోయి
ఆమె ఆకర్షణకులోనై, ఆమె సంకల్పబలంతో
ఆమె ప్రభావంతో, ఆమెనే పొందాలన్న కాంక్షతో
అసహనంగా, ప్రేమహృదయాలకు బందీలై
బాధించే బంధాలనే కావాలని వాంఛిస్తూ
వదలుకోవలసిన బరువుల్ని భరించారు
అది ఆమె సౌందర్యప్రభావం, ప్రేమస్వభావం.

కొందరు గుడ్డిగా, జీవనలాలసతో ఆమెను వాంఛించారు
ఆమె తమ స్వంతం అన్నంతంగా ప్రేమించారు
అందరికోసం దాచిన ఆమె ప్రేమ తమస్వంతం కావాలనుకున్నారు
వెలుతురును భూమి తన స్వప్రయోజనాలకై కోరినట్లు
వారు ఆమెను స్వార్థదృష్టితో వాంఛించారు
ఆమె కదలికలు తమవేనన్న మాత్సర్యం,
వారి అల్పత్వానికి ప్రతిఫలం శూన్యమే అయింది
ఆమె తమచేతికి చిక్కలేదని విలపించారు
ప్రేమపాశాలతో ఆమెను తమతో బంధించాలనుకున్నారు.
కానీ, ఆమెస్పర్శ భరించరానిదే అయింది.
తామొక పాషాణాన్ని ప్రేమించామని నిందించుకున్నారు
ఎండనుండి నీడలోకి వచ్చినట్లు సేద తీర్చుకున్నారు
ఆ మహాత్తు తమకు అవసరంలేదని నిందించారు.
ఆమె మధుర ప్రేమకిరణం అందనందుకు క్రుద్ధులై
తమ బలహీనతకు తామే బెంగపడిపోయారు

వాంఛించిన స్పర్శ అందనందుకు బాధచెంది
సన్నిహితంగా దివ్యత్వాన్ని పొందలేనందుకు కినిసి,
తాము భరించలేని శక్తి ఆమెదని గ్రహించారు.
కొందరు అయిష్టంగానే ఆమె ప్రభావానికి లోనైనారు
ఆ మాధుర్యాన్ని, మహత్తును పొందగలిగారు
కానీ, సూక్ష్మ, ఉన్నతస్థితుల్ని చేరుకోలేక
ఆమెను, భూమిస్థాయికి తీసుకురావాలని యత్నించారు
ఆమెచుట్టు తమ ప్రేమజీవితాలతో వలపన్ని
తమ మానవతాబంధాలతో ఆమెను బంధించ యత్నించారు
ఆమె ఔన్నత్యం వారి ఆత్మల్ని దానోహం అనిపించింది.

ఈ ప్రపంచంలో, ఆమెపిలుపు నందుకున్నవారిలో
ఎవరూ ఆమెకు సమంగా, తోడుగా నిలవలేకపోయారు.
ఆమె తన అంతస్తునుండి వారిస్థాయికి దిగివచ్చింది
ఆమెఅంతస్తులో అల్పజీవులు మనజాలరు.

ఆ మిత్రులు తన ఔన్నత్యాలను అందుకోవాలని
ఆమె హృదయపూర్వకంగా తన శక్తిని వారికి పంచిపెట్టింది.
ఏదో దివ్యశక్తి మనిషిలో ప్రవేశించి - మానవత
దివ్యత్వంతో ఉద్దీప్తంకావాలని ఆమె ఆశించింది.

ఆమె తానుగా వారి అల్పస్థితికి దిగజారి, వారి
జీవితాలను తన మమతాహస్తాలతో బంధించినా
వారి అవసరాలు, ఆశయాలు ఏవో ఆమెకు తెలుసు
వారి శూన్యజీవితాలలోకి తానే చొచ్చుకుపోయింది
వారి సుఖదుఃఖాలలో హృదయస్పందనల్లో భాగం పంచుకుంది
వారి దుఃఖాన్ని, అతిశయాన్ని తొలగించ ప్రయత్నించింది
తన ఏకైక శిఖరంపై తనదైన మహాశక్తితో
వారి ఆశయాల గొంతుకలు ఆలకించింది.
వారి ఆత్మల్ని తన విశాల పరిధిలోకి తీసుకుని,
తన ఆంతర్యపు ప్రశాంతితో వాటిని చుట్టివేసినా,

జగన్మాత తన ఔన్నత్యాన్ని నిలుపుకున్నట్లు
ఆమె ప్రాపంచికత మాత్రం వారి బాధ్యత వహించింది.
వారి అశాశ్వతత్వంతో అగ్నుల్ని సంయోగించింది
ఆమె మహదాత్మ లోలోపల ఒంటరిగానే ఉండిపోయింది.

ఒక్కొక్కసారి మూగవోయిన ప్రకృతిచలనంలో, ప్రశాంతిలో
ప్రవిమలమైన సాన్నిహిత్యాన్ని ఆమె అనుభవిస్తుంది
ఆమెశక్తి ప్రపంచ మానవ ప్రాయికతను ఆకర్షిస్తుంది
ఆమె తన ఆత్మానందంకోసం, తృప్తికోసం
పశుపక్ష్యాదులతో, చెట్టుచేమలతో, చిత్రవిచిత్ర
గతుల సాగే జీవితాలతో ఆత్మ చేయికలిపింది.
నిరాడంబరంగా అవి ఆమెలో కలిసిపోయాయి,
కానీ, మనిషిలోనే అర్థంలేని అశాంతి నిలిచిపోయింది
ఆ అశాంతివల్లనే మనిషి దివ్యతేజస్సుకు దూరమై
అంధకారంలో పతనంచెందడాన్ని ఆశిస్తాడు.

ఆమె ఆకర్షణకు లోనై ఆమెను సమీపించినవారిలో
ఉన్నత లక్ష్యాలుగల సహచరుడు ఆమెకు కనిపించలేదు
ప్రకృతి, పరమాత్మవలె ఒక్కటై, తనకై
అవతరించిన ఆత్మబంధువు అవుపించలేదు.
కొందరు చేరువై ఆమె స్పర్శకు కాలి విఫలులై వారు
ఆమెశక్తి అతి పవిత్రం, ఆమె వాంఛించేది మహస్సు.
అలా తనచుట్టు వున్న సూర్యునివలె వెలుగువింపి
ఆమె తన అంతర్ ఆకాశంలో ఒంటరిగా ఉండిపోయింది.
అతి సన్నిహితులకు ఆమె దూరం కాజొచ్చింది
దేవతామూర్తులవలె, ఆమెఆత్మ ఒంటరిగా మిగిలింది.

విశాల మానవప్రపంచంతో సంబంధంలేకుండా
సాటివయస్సువారితో పరిమితంగా మెలుగుతూ
ఆమె బాల్యం, స్వల్పపరిధిలో ఇమిడిపోయింది
ప్రాపంచిక జీవన విషయాలతో తొలిపరిచయం అది

అప్పుడే దివ్యత్వం ఆమెలో స్పందించసాగింది.
జనసంచారం లేనిచోట వికసించిన పుష్పంవలె
దేవతల ఉద్యానవనంలో ఆమె తృప్తిచెందింది.

ఆమెలో దాగివున్న జ్యోతిని లోకం గుర్తించలేదు
కాని లోలోపల ఏదో చలనం కదలాడసాగింది
అప్పుడొక సంచలనం, అప్పుడొక వలపు పిలుపు
ఒక ఇంద్రచాపం స్వప్నం బంగరు పరిణామంపై ఆశ
రానున్న మార్పును సూచించే రెక్కలచప్పుడు
ఏదో అపూర్వ, వినూత్నస్పందన, అనుభూతి
కాలం గుండెను అందంగా కదిలించింది.

అప్పుడు ఆమె తాలూకు సవ్వడినేలను తాకింది
గుప్తంగావున్న అవసరంతో ఆత్మ దివ్యమైంది
ఈ మహావిశ్వం ఆమెను గుర్తించింది
అద్భుతం గొంతువిప్పి గానం చేసింది.
ఆ తేజోరహస్యం అప్పటికే జీవిలో రహస్యంగా వుంది
ఆ ప్రాచీన రహస్యానికి కీలకం అగ్నియోగమే
ఆమెపేరు మనుషుల పెదవులపై సాగింది
అదే మధురంగా, ఉత్తమమంత్రంగా మారింది.
అదే విపంచిగా, కావ్యంగా పరిణమించింది.
అదే మహర్షి గానంచేసిన భావగీతం అయింది.

ఆమె అందచందాలు, ఆకర్షణ, మహత్తులు
అందుకోలేని దూరంలో కనిపించసాగాయి
సంధ్యాసమయంలో మెరిసే మెరుపులవలె
ఆమె మహత్తు అందుకోలేనంత దివ్యం.
ఆమె హృదయాన్ని రంజింపగల హృదయం కనిపించలేదు
ఆమె ప్రశాంతతను భరించగల ఆత్మిక ప్రేమ లేదు
ఆమెను ప్రేమించగల నాయకుడు కనిపించలేదు
ఆమె కన్నులను అలరించగల కన్నులే కనిపించవు

ఆ అసంపూర్ణతకు ఆమె ధీశక్తి అబ్బురపడ్డది
మానవలోకంలో ఆత్మకురక్షగా వున్న వివేకం
స్త్రీరూపంలోవున్న దేవతామూర్తి అయింది.
తన స్వభావానికి అనుకూలంకాని స్పర్శనుండి
ప్రాపంచికత ఉపసంహరించుకుని పరిమితమైంది.

మానవహృదయాలు భౌతికసౌందర్యాన్నే వాంఛిస్తాయి.
అమరలోకాలనుండి తమవెంట తెచ్చుకున్న
అగ్నితాపాలను, ఒంటరిఆత్మలు భరించలేవు
దివ్యాత్మలతో, దివ్యంకాని ఆత్మలు కలవలేవు.

ఎంతటి మహాత్ముడైనా ఒంటరిగా జీవించవలసిందే!
అతను పూర్ణంగా, తన ఏకాంతంలోనే సంచరిస్తాడు
తనవారి ప్రాపుకోసం ఆరాట పడడు.
అతనికి సరిజోడు ఆతనిలోని పరమాత్మ ఒక్కడే.

అదే సావిత్రి విషయంలోనూ సార్థకమైంది.
అందరూ ఆమెను ఆరాధించారుగానీ, ఎవరూ ఆశించలేదు
ఉన్నత శిఖరంపైనుండి కిరణాలు ప్రసరించాయి
ఆమె హృదయం ఒక బ్రహ్మానంద మందిరం.
ఆ సంపూర్ణ మందిరంలో ఒకదీపం వెలిగింది
పూజారిలేని మందిరంలో ఒక పవిత్రమూర్తి వెలిసింది
పరిభ్రమించే జీవులమధ్య ఆమె ఆత్మ-తపసు తానే
దూరమై అదృష్ట శిఖరాలకై ఎదురు చూడసాగింది.

# ప్రేరణ

దివ్యసౌందర్యంతో దేవతవలె కన్పిస్తున్న సావిత్రిని పురుషులు ఆరాధించారేతప్ప అర్థించలేదు. తనకు అనుకూలమైన పతికోసం తానే అన్వేషించవలసివచ్చింది - తానుగా స్వయంవరానికి పూనుకుంది-శోభనసమయం ఆసన్నమైంది. ప్రకృతిసైతం అందుకు అనుకూలించింది - కోయిల గానాలు, మందమలయానిలాలు ఆమెలో ప్రేమను ఉద్దీపించాయి.

ఒకరకంగా భూమి స్వర్గమే. దేవతలుసైతం భూమిపైన తిరుగుతూ ఉంటారు. వారిని మనం గుర్తించలేం - దివ్యమానవులను సైతం మనం గుర్తించలేం. ప్రాచీన ఋషులు, తాపసులు సహకరించారు. అశ్వపతికి సావిత్రి హృదయం తెలుసు. ఆమె సామాన్య మానవకాంత కాదు. ఆమె ప్రపంచంలోకి ఒంటరిగా వెళ్లి, తన జీవనసారథిని ఎన్నుకోగలదు - ఆ మాటలు మంత్రంవలె ఆమె చెవులలో ప్రతిధ్వనించాయి. ఒకరాత్రి అంతా ఆలోచించింది. ఉదయానికి ఆమె రాజప్రాసాదం, రాచనగరు వదలి వెళ్ళిపోయింది.

నూతనసృష్టి వికసనానికి నాంది అనదగిన ప్రభాతం,
నిర్మల ఆకాశంలో మహత్తర సూర్యతేజాన్ని అందించగా,
పరిణామరహితంగావున్న మూలప్రకృతి
సౌందర్యంతో, వైవిధ్యంతోనిండి కదలసాగింది.
అచిరకాలంగా వున్న వాంఛ కొత్తవేళ్ల పుంజుకున్నది.
అసంపూర్ణ కామనతో పరిసరాలు నిండిపోయాయి
బ్రహ్మానందం చేరువైనప్పుడు చలించే ఆత్మలవలె
పెనుగాలులకు మహావృక్షాలు ఊగసాగాయి.
ఆ మహారణ్య హృదయంలో దాగిన రహస్యం,

ఆకులచాటున దాగిన కోయిల, అలసటలేక
ఒకే ఒక్క ౹పేమగీతికను పదేపదే ఆలపించసాగింది.
౹పాపంచిక అలజడులకు, సవ్వడికి కడుదూరంగా
పరలోకపు ౹పశ్నలు, సమాధానాలు కలుసుకునేచోట
భౌతిక కర్ణేం౹దియాలు వినలేని శబ్దచయాన్ని
అశ్వపతి కాంతికిరణంతో వినగలిగాడు.
మన జీవితాన్ని పరివేష్టించివున్న సూక్ష్మమండలంపై
మూసివున్న అంతరాత్మ సమాధిద్వారాలు తెరుచుకున్నాయి.
౹పకృతిలో వినిపించని శబ్దాలు వివిపించసాగాయి
ఇక్కడి జీవుల చ౹క౹భమణానికి అవల
౹పస్తుత ఆరాటాల, అవసరాలకు ఆవల
శూన్యరోదసి ఆవేదనా హృదయం నుండి
పరమాత్మను స్తుతించే విశ్వాల భావగీతం వెలువడింది.
కాలపు వెలుగు కటకటాలవెనుక, జనిమ్రంచని
శక్తులు అణచివేసిన స్వరాలను వివగలిగాడు,
మరొకమారు మహత్తర వాంఛ రగిలి, జ్వలించి
భూమిపైన మనిషి పూర్ణజీవనాన్ని కాంక్షించింది.
అస్థిరమేధస్సులో సుస్థిరతకై ౹పార్థించింది.
బాధిత మానవహృదయానికి నిర్మలానందాన్ని,
ఈ అయోమయ ౹పపంచంలో 'సత్య' ౹పతిష్టాపనమ,
మానవరూపాలలోనే దివ్యత్వాన్ని అభిలషించింది.
సుదూర భావాంబరంనుండి ఉరికివచ్చిన శబ్దం
వినగలిగినవానికి విస్పష్టంగా వివిపించింది.
అతని మేధ రహదారులలో ౹పతిధ్వనిస్తూ పయనించి
స్వీకరించగల చోట తన ము౹దలను వేసింది.
"విధికృతాన, బలవంతంగా జనిమ్రంచిన మానవుడా!
ఈ అనంత విశ్వంలోని సాహసయా౹తికుడా!
సంకుచిత మానవతలో బందీ అయిన జీవుడా!
నీ చిన్ని ఆత్మచుట్టు, అల్పవిషయాల చుట్టు

ఎంతకాలం మనోచక్ర భ్రమణంలో తిరుగుతావు?
ఎదుగుబొదుగులేని అల్పత్వమే నీ లక్ష్యంకాదు.
పునరావృతం కావడానికై నీవు జన్మించలేదు
అ-మృతత్వంతో నీవు తయారైనావు
నీవుచేసే పనులన్నీ వికాస సోపానాలు కావాలి
దేవతా వికాసానికి నీ జీవితం సిద్ధపడాలి.

నీలో ఒక ఋషి, సృష్టికర్త వున్నారు
నీ నిత్యకృత్యాలపై అమృతం వర్షిస్తుంది
ప్రకృతి అణవణువులో పరమాత్మశక్తులు దాగివున్నాయి.
నీముందు ఉజ్వల భవిష్యత్తు ఎదురుచూస్తున్నది.
భౌతికప్రపంచంలో వున్న జీవి, స్వసంకల్పంతో
తన కృషిని అతీంద్రియ పథకంలో ఇమడ్చగలడు.

అజ్ఞాననేత్రాలతో ఇక్కడి ప్రపంచాన్ని చూచే వ్యక్తి
అంధకార నిశీధం నుండి ఎన్నటికీ మేల్కొనలేడు.
దివ్యదృష్టితో సత్యాన్ని చూడడు; సత్యాన్ని క్రమ్మిన,
మాయపొరల్ని బాహ్యరూపాల్ని మాత్రమే చూడగలడు;
అయినా నీ హృదయం దివ్యత్వంతో నిండిపోతుంది.
నీవు ఆధ్యాత్మిక వాతావరణంలో జాగృతమై
భౌతికమేధస్సు గోడలను ఛేదించిన అనుభూతితో,
హృదయాన్ని నిస్తబ్దంచేసే సందేశాన్ని వింటావు.
అగ్నిగోళాలవంటి కళ్ళతో ప్రకృతిలోకి చూస్తావు
పరమాత్మ ద్వారం వద్ద నీ శంఖాన్ని పూరిస్తావు.

ఈ భూమిపై పరిణామకర్తలు, ప్రమాదభరితమైన
ఆత్మమండలాలను దాటే అవకాశం కల్పించారు
జాగృతమై జగన్మాతను స్పర్శించడానికి,
ఈ మాంసమందిరంలోనే పరమాత్మను కలుసుకొనడానికి
జీవుని, అనంతవిశ్వరూపంతో ఏకంచేయడం నేర్పారు.
నీవు చరించే భూమికి, స్వర్గానికి మధ్య ఒకే తెరవుంది.

నీవు జీవించే జీవితం, నీ ఆత్మతేజస్సును చూడనివ్వదు.
నీ జీవన కవాటాలవెనకనే అతీంద్రియశక్తు లున్నాయి
ఆత్మ శిఖరాలపై దూరంగా దివ్యశబ్దాలు వినిపిస్తాయి,
నిన్ను నీవు అధిగమించడానికి, భావ దుంధుభులు మ్రోగాలి,
అవి కొందరే వినగలరు, కొందరే వాటిని ఆశించగలరు,
ఆ తాదాత్మ్యస్థితిని అగ్నుల్ని, కొందరే భరించగలరు.
ఆశా నిరాశలు వసుధ గుండెను బ్రద్దలు చేస్తాయి
ఇచ్ఛా శక్తులు, రూపాన్ని, విధిని అధిగమిస్తాయి.
అజ్ఞానాంధకారంలో చిక్కుకున్న దేవత పైతం
మర్త్యభూములలో విహరిస్తూ, జీవితం గురించి కలగనాలి.
నరక యాతనలు అనుభవిస్తూ ఆనందాన్ని వాంఛించాలి.
నైరాశ్య శిఖరాలపై ఆశాహర్మ్యలమ విర్మించాలి.
ఒక్క మెట్టుపైకిపోతే, సర్వాన్ని విస్మరించవచ్చు.
కానీ, బాధలలోనే, మానవుల ఔన్నత్యం కనిపిస్తుంది.
మానవ హృదయాలలో ఆరోహణాగ్ని మసకగా
పరమాత్మ అదృశ్యంగా, అనారాధనీయంగా ఉంటుంది.
మనిషి పరబ్రహ్మను పైతం పరిమిత రూపంలోనే చూస్తాడు
ఒక మానవ రూపంతో, ఒక పేరుతో పంభావిస్తాడు.
నిగూఢ శక్తుల్ని వదలి అల్ప ప్రయోజనాలు ఆశిస్తాడు
ఒక భూతారాధనకై గుడిలో దీపాలు వెలిగిస్తాడు
తన వేదనల్ని పెంపొందించే అజ్ఞానాన్నే ప్రేమిస్తాడు
అతని మహత్తర శక్తులపై 'మాయ' పొర క్రమ్ముతుంది.
అతని భావాలకు ఆకరమైన అంతర్వాణిని విస్మరించి
జ్ఞాన పీఠమైన మూలత్రికోణంపై ముసుగువేసి
విచిత్ర మందిరంలో శిలా విగ్రహాన్ని ప్రతిష్ఠిస్తాడు.
మహామాయ అతనిని తెరలతో కప్పివేస్తుంది.
ఆత్మ సంకేతాలు నిష్ప్రయోజనాలవుతాయి

మహర్షుల అనంత బోధనలన్నీ నిరుపయోగాలే
మహాత్ములు మసక వెలుగులో సంచరిస్తుంటారు
కవులు బాహ్య స్వప్నాలనే స్తుతిస్తుంటారు.
నిరాధారమైన అగ్ని రేపటి ప్రపత్తులకు ప్రోత్సాహం
స్వర్గం నుండి జ్వలితాగ్నులు దిగివచ్చి, తిరిగిపోతాయి
జ్ఞాన నేత్రం సమీపించి, నిష్క్రమిస్తుంది.
పరమాత్మ పలుకులను ఎవరూ అర్థంచేసుకోరు
విధి తృణీకరిస్తుంది, ఆంతర్యం అంగీకరించదు,
చేసిన ప్రయత్నాలన్నింటినీ అవివేకం వ్యర్థపరుస్తుంది.
అప్పటికే మేధయవనిక రవ్వంత తొలుగుతుంది.
తెలుసుకోగల జ్ఞానులు సగం సత్యాన్నే చూడగలరు
బలవంతులు చిన్న శిఖరం పరకైనా వెళ్లలేరు
ఆశించే వారు కొద్దికాలమే ప్రేమించగలరు
పరమాత్మ కథ సగమే తెలుస్తుంది, మిగిలింది రహస్యమే.
మానవ రూపంలో వున్న దేవతలు కొద్దిమందే"

అశరీరవాణి ఆకాశంలో కలిసిపోయింది.
దేవతల సమాధానం వలె తేజోశకలం
దిఙ్మండలాలు దాటి సావిత్రిని చేరింది.

ఆకాశాన్ని అంటే మహారణ్య వృక్షాల మధ్య తిరుగుతూ
రంగు రంగుల వలువలు ధరించిన బాలికవలె
అమృత లోకాల వైపుగా మండే జ్వాల అయింది.
ఆమె భగభగమండే చలిత జ్వాల,
ఆకాశమే ఆచ్ఛాదన, వసుధ భూమిక అయిన దేవాలయం,
ఆ అదృశ్యమందిరంలో ఆమె ఒక బాటసారి.
సత్యం ఆవిష్కృతమయ్యే సమయం ఆసన్నమైంది:
అతని ఆంతర్యంలో సృష్టికి సమాధానం లభించింది
కాంతిహీనమైన భౌతికనేత్రాలకు అది పరిమితం కాదు.
అది ప్రాపంచిక ప్రమోదానికి ఆలంబన,

మహాద్భుతమైన దివ్యకళాచాతుర్యం
దాహార్తులైన దేవతలకు అమృతకలశం
అది పరబ్రహ్మ సచ్చిదానంద రహస్యం
అది పవిత్రయోగాగ్నినుండి ఉద్భవించిన మాధుర్యం
అన్నీ ఆ పారదర్శనంలో కొత్తగా కనిపించాయి.

అతిసున్నితంగా ఏర్పడిన రూపం, పరిణామం చెంది
ప్రకృతి ఆత్మనివేదనకు సంకేతమైంది.
పవిత్రజన్మలతో క్షాళణమైన సువర్ణపత్రం
జీవంనుండి విశ్వసంకేతం రూపుదిద్దుకుంది.

ఆమె ఫాలం, చెరగని స్వర్గాలకు ప్రతీక
అది తపస్సుకు ఆలంబన, రక్షణ
ఆ మందస్మితం ఆనంద లోకాలకు సూచిక
ఆమె నుదురుపై ప్రతిరేఖ అనంతానికి సంకేతం.
మేఘమాలికలవంటి ఆమె వినీలకుంతలాలలో
విశాల నయనాలు రెక్కలు విప్పిన నిశీథాలు.
స్వర్గచంద్రరేఖవంటి నుదురు కన్నకలలలో
ఈ లోకాన్ని శాసించగల ప్రేమ, భావసంద్రాలు
అద్భుత ప్రపంచంలో, జీవితంలో, సత్యాలు కడుదూరం
అమృతత్వం ఆమెశరీరాన్ని నింపివేసింది
బంగారుపాత్ర పూర్తిగా నిండిపోయినట్లు
బ్రహ్మానంద పారవశ్యం కలుగసాగింది.
స్వర్గానికై భూమి మూగగా ఆరాధించసాగింది.
సజీవరూపంలో సౌందర్యం ఆవిష్కృతమై
శాశ్వతమైన పూర్ణత్వాన్ని అభిలషించింది.
సజీవ భౌతికరూపంపై మాయతెర తొలగి
అతని దృష్టికి వ్యక్తవ్యరూపం కనిపించింది.

బాహ్యదృష్టినుండి, భౌతికస్పర్శనుండి విముక్తమై
రూపాలన్నీ ఒకే అరూపస్థితికి అనుబంధశక్తులై

మానవరూపంలోకి, మానవ కార్మికతలోకి
దివ్యత్వం, అతి నిగూఢంగా అవతరించింది.
అది జీవితానికి అంటీముట్టనట్లు వేరై
పరిణామశీల విశ్వానికి భూమిక అయింది.
భావకుడ్యంపైన దివ్యత్వం శిల్పాకృతి ధరించి
కదిలే కాలంపై ప్రతిఫలిస్తూ, మనకగా
గుహాలయంలోని దేవతగా మారిపోయింది
మనస్సు కల్పించుకున్న విలువలు నశించిపోయాయి
శరీరం భౌతికస్పృహను వదలివేసింది.
అమరత్వం ఉన్నతస్థితిలో అమృతమయమైంది.
బాహ్యరూప ఆచ్ఛాదనక్రింద దాగిన ఆత్మసత్యం
నిత్యనైమిత్తిక బాధ్యతలనుండి విముక్తం కాగా.
పైకి కనిపించే శరీరం, అవయవాలు, వీటితో
అగోచరమైన ఆత్మ తన బిడ్డగా జన్మించింది.
తనలో ఎక్కడోవున్న అంతర్దృష్టి ప్రేరణతో
తమ శక్తిని అంచనావేయలేని భావాలు వెలువడ్డాయి.
ఆ సువిశాలమైన లోతులలో, మానసికమైన
ఇరుకుబాటలలో 'ప్రేమమూర్తి' కరుణించింది.
అగోచర శిఖరాలనుండి పరమాత్మ పలకరించింది.
ఒకానొక సాధారణ ప్రజ్ఞ మన జీవితాన్ని మార్చగలదు.
అజ్ఞాతంగా మన వాక్కును శాసిస్తున్నవారు,
ఒక్క క్షణకాలంలో మనోభావాలను మార్చి
అచేతనంగా 'విధి'కృతం అనిపించగలరు.
"అనంతంగా ప్రయాణం సాగిస్తున్న ఓ ఆత్మా !
అమృత దిగంబరాలనుండి నీవు దిగివచ్చి,
ఈ జీవితంలో కడగండ్ల కవచాలు ధరించావు,
విధిని, కాలాన్ని జయించాలన్నది నీ ప్రయత్నం,
నీవలె చంద్రుడు శూన్యంలో కళలుకంటున్నాడు.
కాని—దివ్యత్వం నీకు రక్షణగా నిలిచివుంది.

స్వర్గాలు నిన్ను ఒక మహాత్మకై రక్షిస్తుంటాయి
నీ అదృష్టం, జీవితం, సుదూరలక్ష్యంగా ఉన్నాయి
నీ ఆత్మ ఒక నక్షత్రంగామాత్రమే దిగిరాలేదు.
ప్రేమ, సౌందర్యం సజీవ శిల్పాకృతి ధరించి
పవిత్ర కన్యత్వం నీలో వరప్రసాదమైంది
నీ బ్రహ్మానంద, అమరశక్తి సందేశాలు,
పరమాత్మ తేజోలిపిలో లిఖితమయినాయి.
దానిని పరిశోధించి జీవితాన్ని ఉత్తేజంచేసుకున్న
వ్యక్తికే నీ రత్నహృదయాన్ని సమర్పించుకోవాలి.
నీ అధరాలపై జాలువారే ప్రశాంత సగడాలు
మందస్మితాలు, మధుర సంగీత మాధురాలు—
నీ నయనాలు నిశీధంలో వెలిగే మధుర నక్షత్రాలు
నీ అవయవాలు బంగారంతో చేసిన కావ్యాలు
నీలో కళాదేవతల వంపు సొంపుల విగ్రహాలు
నీలోని ఆకర్షణకు ప్రేమాదరాలు ప్రతీకలు.
నీ సహచరునికై ప్రపంచం లోలోపలికి పో।
ఎక్కడో భూమిపై నీకోసమై ఎదురుచూస్తున్న
నీ అగోచర ప్రియుడు అదృశ్యంగా కనిపిస్తాడు.
అన్యసహాయం అవసరంలేదు, నీ ఆత్మే నీకుతోడు
నీ గుండెలో రగిలే శక్తులే నీకు సహాయం.
నీ స్వభావానికి అనుకూలుడైన వేరొకజీవి
నీ జీవితంలో చివరివరకు నీతో కలిపి జీవించేవాడు
నీ అడుగులతో కలిసి అనుగుణంగా నడిచేవాడు
నీ హృదయ తంత్రులకు అనుగుణంగా ఆలపించేవాడు
నీలో మూగగావున్న స్వరాన్ని పలికించేవాడు
నీవు ఎదురు చూస్తున్న వ్యక్తి, నిన్ను కలుసుకుంటాడు.
అప్పుడు మీ హృదయ తంత్రుల రాగాలు ఆలపిస్తాయి
వైవిధ్యంలో, ఆనందంలో మీరు సమైకం అవుతారు
దివ్యత్వంలో, శ్రమలలో సమానంగా స్పందిస్తారు

అనంత జగన్నాటకానికి కొత్తరుచులు కల్పిస్తారు
ఏకైక శక్తి నీకు మార్గదర్శకమై, నిన్ను నడిపిస్తుంది
నీలోను, నీచుట్టూ, ఒకే తేజస్సు వెలుగుతుంది
చేయిచేయి కలిపి జీవితాన్ని స్వర్గం చేసుకోవాలి
మహత్తరమాయ కల్పించే కష్టాలను ఎదుర్కోవాలి,
ప్రకృతిని దాటి దివ్య శిఖరాలపైకి అధిరోహించు
దేవతల్ని కల్లుసుకొని, పరమానందం అనుభవించు
తర్వాత కాలాన్నిదాటి నీఆత్మను పరమాత్మతోచేర్చు"

అదే సత్తుకు, సర్వ జగత్తుకు మూలమైన బీజం
మూసివున్న ఆమె హృదయ కవాటాలను
ఏదో ఔన్నత్యం చేయిచాచి తెరచి
ఆమె జన్మ రహస్యం తెలియ బరచింది.
యోగి చెవిలో మంత్రం లయించినకొలదీ
మంత్ర సందేశం మేధలో ప్రవేశించి కదిలిస్తుంది.
దాని శబ్దం చీకటిలో జడంగావున్న కణాలను కదిలిస్తుంది
ఆ శబ్దస్వరూపం శ్రోతకు అవగతమవుతుంది.
దాని భావాన్ని, మనస్సులో మననం చేసుకుంటూ
శ్రమించే మేధలో అర్థాన్ని అన్వేషిస్తాడు.
సత్యస్వరూపాన్నికాక, దాని సంకేతాలను చూడగలడు.
తెలుసుకోవాలన్న ఆశతో, తనలో విశ్వాసమై
తన ఆత్మ సందేశాలను అంతర్యంలో వింటాడు.
ఆ మంత్రమే శబ్ద తరంగాలై వినిపిస్తుంది.
భావం, దృశ్యం, అనుభూతి, స్పందన, శరీరస్పృహ
అన్నీ క్రమంగా నశించిపోగా, అతను
బ్రహ్మానందలో అమర పరిణామం చెందుతాడు.
తానే అనంతంగా వ్యాపించి, శక్తిగా పరిణమిస్తాడు
సర్వ విద్యలు సాగరం వలె అతనిని చేరుకుంటాయి.
ఆధ్యాత్మిక కిరణ ధవళిమలో ప్రక్షాళనమై

అతను ఆనంద, ప్రశాంత నగ్నస్వర్గాల సంచరిస్తాడు
భగవంతుని సాక్షాత్కారం పొంది సంభాషిస్తాడు.

ఆమె జీవితంలో తత్సమాన ఔన్నత్యం నెలకొన్నది
ఇప్పుడు పరిచితరంగాలన్నీ ముగింపుకు చేరాయి
తనకు పరిచయమైన శక్తుల మధ్య విలాసంగా సంచరిస్తూ
కొత్తపుంతలు తొక్కి, దివ్య సందేశాలు అందుకుంటూ
తనవికాని ఔన్నత్యాలవైపు దృష్టి సారించింది.
తెలియని మాధుర్యాలకై ఆమెహృదయం ఆరాటపడ్డది
కనిపించని లోకాల రహస్యాలు ఆమెకు చేరువైనాయి.
ఉదయం గడచి, ఆనందపు అపరాహ్ణంలో,
నిశ్చల సమాధిలో కెంపులై, గతించి
సువర్ణ సాయంసంధ్యలోకి పొద్దువాలింది.
వినీల గగనంలో శశాంకుడు పయనించాడు.
స్వప్నంవలె రేయి అంచులను తాకింది
అనంతంలో నిశిలో తారకలు వెలిగాయి.
మనసులోని రహస్య గుహలలో సర్వం దాగివుంది.
ఆకాశ విహంగం చీకటి రెక్కల్ని విదల్చి
బాహ్యదృష్టికి అందకుండా అనుభూతుల్నిదాచి
స్వప్న లోకాలలో అందని లోతుల్ని వెదకసాగింది.
రేయి చీకటి ముసుగునుండి ఉదయం బయటపడి
నప్పుడు సంజ వెలుగులు ఆమె వదనాన్ని కాంక్షించాయి
కానీ, అంతఃపురం శూన్యంగా తోచింది.
రాజప్రాసాదానికి, నిత్య సంతోషాలకు దూరమైంది.
వెన్నెల పరచిన నేలపై ఆమె పాదచంద్రికలు కదలలేదు
దివ్యత్వం, సౌందర్యం కనిపించకుండా పోయాయి.
విశాల విశ్వంలోకి ఆనందం అన్వేషణకై బయలుదేరింది.

# అన్వేషణ

రాచనగరు, రాజప్రాసాదం వదలిన సావిత్రి లోకంలోని కొత్త బాటలలో పయనించింది — ప్రపంచంలో కనువిందుచేసే అందాలను అనుభవించింది - అనేక దేశాలు తిరిగి, అనేక మందిని చూచింది— ఎవరినిచూచినా అంతా తనవారే, తానే అనిపించింది. చివరకు గాలులు, నక్షత్రాలు తానే, తనవే. తనకు నేస్తాలే. తనకు తెలిసిన బాటల్లోనే పయనిస్తున్నాననిపించింది. అన్నీ జ్ఞాపకం వచ్చేవి - అన్నీచూచినవే - కొత్త లోకాలు దర్శించాలని తపన. కొండలు, అడవులు గాలించింది—ఆశ్రమాలు దర్శించింది. అక్కడి మునులను, యోగులను చూచింది - వారంతా జ్ఞానులు మౌనులు, వారి శక్తులు అపారం - వారు భాషించినా, సంభావించినా వరమే.

ఆశ్రమాలు తిరిగిన సావిత్రిలో జ్ఞానతృష్ణ అధికం కాసాగింది. కానీ ఆమె అన్వేషణవేరు. ముందుకే సాగింది. దివ్య శక్తులను తనకు సహకరించమని విన్నవించుకుంది - ప్రకృతి సౌందర్యాలన్నీ ఆమె ముందర పరచుకున్నాయి. ఆ అందాలను ఆస్వాదిస్తూ ఆమె అన్వేషణ సాగించింది.

ప్రపంచమార్గాలేవో సావిత్రికి తెలియసాగాయి
తొలుత, చిత్రాతిచిత్రమైన సవ్య తేజోమండలాలు
ఆమె మనస్సున నిండి, కళ్లముందు కదలసాగాయి.

కాని ఆమె భూమిపరిమాణంతో కదలిన కొలదీ
ఆమెనుండి ఘనచైతన్యం వెల్లువకసాగింది;
అన్ని రంగాలు, వాతావరణాలు ఆమెకు నెలవులే,
ప్రతిదేశం, ప్రతినేల ఆమెకు స్వస్థానమే అయింది

మానవతాలక్ష్యం సమస్తం తనది అయ్యేవరకు
ఆమె ప్రజలందరనూ స్వజనంగానే భావించింది.

ఆమె మార్గంలో ఎదురైన కొత్తప్రదేశాలు,
ఆమె అంతర్ వివేకానికి సన్నిహితంగా తెలిసినవే
ఆ సుందర సీమలన్నీ మరచిపోయిన దృశ్యాలే,
ఆమె చూస్తున్న నగరాలు, నదీనదాలు, క్షేత్రాలు
నెమ్మది నెమ్మదిగా ఆమె స్మృతిపథంలో కదలసాగాయి.
రాత్రివేళ కనిపించే తారకలు, ఆమె చిరకాల మిత్రులే
గాలులు సైతం ఆమెకు పురాతన విషయాలు జ్ఞప్తిచేశాయి
ఒకనాడు ప్రేమించిన అనామక మిత్రుల్ని కలుసుకోసాగింది.

అన్నీ తాను మరచిపోయిన స్వవిషయాలే
స్పష్టాస్పష్టంగా, మెరపు శకలాలవలె, ఆమె
గతకాలపు శక్తులన్నీ స్మృతిలోకి రాసాగాయి.
ఆమె చలనంలోని లక్ష్యమూ కొత్తది కాదు
ఒక మహత్తర సంఘటనకు ముందు ప్రయోక్తగా
ఆమె ఆత్మే ఆమెకు సాక్షిగా నిలిచింది
అనేకసార్లు చేసిన యాత్రనే మళ్లీ చేస్తున్నట్లనిపించింది.

నిర్జీవంగా సాగే చక్రభ్రమణాన్ని అసహాయతగా మార్చ.
చీకటి జడలు విరబోసుకున్న రాక్షసులు
సాధకుని శరీరంపై స్వారీ ప్రారంభిస్తారు
మనిషి జన్మించినదాది అతనినే అంటిపెట్టుకుని
బాహ్యంగానూ, ఆంతరంగికంగానూ శాసిస్తుంటారు.
సాధకుని ఆత్మ సంకల్పానికి వారే ప్రతినిధులు
వారే అతని విధిని శాసిస్తారు, సాక్షులై చూస్తారు.

వారు తమ తమ కర్తవ్యాలను కఠినంగా నిర్వహిస్తూ
మన పూర్వజన్మలతో కలిపే సూత్రాన్ని పట్టుకుని
జీవుని స్వభావాన్ని చెదరకుండా రక్షిస్తుంటారు

విధి విహితమైన జీవన మార్గంలో సహాయకులై
అతను అనుభవించే ఆనందాలలో, బాధలలో చివరకు
నిత్యనైమిత్తిక కర్మలలో జోక్యం కలిగించుకుంటారు.

మన ఆలోచనలు, పనులు ఏవీ నిష్ప్రయోజనం కావు
ప్రతిదానికి కొంతశక్తి ఖర్చవుతుంది, ఫలితం వుంది
అమరమైన మన గతాన్ని ఛాయామాత్రంగా రక్షిస్తూ
మన కృతకర్మలకు విధిని ఫలంగా చూపిస్తారు
మనం మన సంకల్పంతో సాగుచేసిన చాలులలో
మరచిపోయిన కృతకర్మల ఫలాల్ని పండించుకుంటాం.

ఈ ఫలాల్ని అందించే చెట్టు కనిపించదు కనుక,
కనిపించని గతం నుండి పుట్టిన వర్తమానంలో జీవిస్తాం
అవి అన్నీ ఒక మహాశక్తి యంత్రంలోని విడిభాగాలు
భౌతిక సూత్రాలతో యాంత్రిక మేధకు కట్టుబడ్డవి,
అయినా అవి మహా సంకల్పానికి పరికరాలే
అన్నింటినీ చూడగల 'కన్ను' పైనుండి గమనిస్తుంది.

దైవ విధికి, దైవేచ్ఛకు కర్త అయినవాడు
ముందుగనే మన జీవితాల నమూనాలు రచించాడు.
మనం వేసే ప్రతి అడుగు, చేసే ప్రతి పని గ్రహిస్తూ
మనలో చరించే క్షుద్రశక్తులను గమనిస్తుంటాడు.

నిశ్శబ్ద శిఖరాలపై, తన కనుబొమలపైగా
పరమాత్మ ప్రశాంతి కొలువున్నదని ఆమెకు తెలుసు
ఆ పరమాత్మకు విధిమలుపులు, లక్ష్యాలు ఎరుకే
అది శరీరాన్ని కార్యనిర్వహణకై భూమికగా చేసింది
అన్వేషించే కళ్లు అందుకు మార్గ దీపికలు
ఆ పగ్గాలను పట్టిన చేతులు, సజీవ ప్రకరణాలు
అంతా పూర్వ పథకం ప్రకారం జరగవలసిందే
దోషానికి తావులేని భగవంతుడు సిద్ధపరచిన మార్గం.

ఎండనక, పగలనక, మధ్యాహ్నాలు, సాయంత్రాలు
ఆమె ప్రకృతిలో, మానవరూపాలలో తిరిగింది.
ప్రపంచంలోని అన్ని శబ్దాలను విన్నది
అంతరాత్మ ననుసరించి ముందుకు సాగింది
మిట్ట మధ్యాహ్నం ఎండలో మెరిసే మేఘంవలె
ఆమె హృదయ తేజస్సులో నిర్మలంగా వున్నది.
తొలుత ఆమె జనపథాలలో పయనించింది;
ఆధ్యాత్మికస్థితుల తీక్షణ దృష్టికి లోనైంది
తీవ్ర మానవ చర్యల వినోద మందిరాలు గడచి
ఆమె రథచక్రాలు ఉరుకులతో, పరుగులతో,
జనాకీర్ణ ప్రాంతాలను, పహరాలను దాటిపోయి
గతానికి ప్రతీకలైన ద్వారాలు, స్వాప్నిక శిల్పసీమలు దాటి
వినీల గగన తలంపై పరచుకున్న నందన వనాలు
సాయుధభటులు కావలావున్న మందిర ప్రాంగణాలు దాటి
ఒకే ఒక నిర్మలమూర్తి, మానవ జీవితాన్ని గమనించే చోటుకు
తమ అమరత్వాన్ని కోల్పోయి, కృత్రిమ జీవనం
సాగిస్తున్న దేవతల ప్రవాస మందిరాలను చేరింది.

సాయం సంధ్యనుండి ఉషోదయం వరకు చీకట్లలో
ప్రకృతి కుడ్యాలపై వెలిగించుకున్న రత్నజ్యోతులు
వెన్నెల నీడలలో నిశ్చలంగా ప్రకాశించాయి
ఆ నిశీధంలో ఆమె అర్థచైతన్యంతో,
స్వప్న తీరాల మధ్య మందంగా పంచరించింది
రాజభవనాలలో, అంతఃపురాలలో విశ్రమించింది.

పల్లెలు, గ్రామాలు ఆమె రథం సాగిపోవడం గమనించాయి.
తాను దున్ని సాగుచేసిన నేలపై మమగడ సాగిస్తూ
జీవించే కొద్ది కాలం, సుఖంగా జీవించడం కోసం
అశాశ్వతమని తెలిసీ, తిరిగి అలాగే జీవిస్తూ,
ఆకాశంవలె మార్పులేని వలయం అది.

మన భౌతిక శ్రమపైకి మారినట్లు కనిపించదు
ఆలోచనాజీవి గడిపే భారమైన క్షణాలకు దూరంగా
విషాద రహితమైన సర్వస్వతంత్రంవైపు మళ్లింది.
ఆమెకిప్పుడు మానవ సుఖదుఃఖాలతో నిమిత్తం లేదు.

అది భూమిప్రాయిక దశలో వున్న శైశవస్థితి
అది కాలాతీతమైన విశాల ఆనంద నిశ్చలత
మనిషికి బాధ్యతలు, బాధలు తెలియని సుస్థితి
అవి అనంత కృషీవలుని అమర లోకాలు
గాలికి కదిలే పసిరిక మైదానాలు ఎండలో కలిసిపోయాయి.
మహారణ్య సంగీతాలు, పర్వతారణ్య ఘోషలు,
తుమ్మెదల ఝుంకారాలతో నిండిన వనాంత సీమలు,
గలగల, జలజల ప్రవహించే నదులు, నదాలు,
స్వప్నలోకాలను దాటిపోయే ఆశవలె
ఆ సువర్ణసుందరి రథం ముందుకు సాగిపోయింది.

ఈ ప్రపంచపు మహత్తర అమానవ గతం నుండి
అనేక స్మృతులు, కాలరహిత అవశేషాలు వెలువడ్డాయి
కాంతిమండలాలు నిర్మల ప్రశాంతిలో కరిగి
అపరిచితమైన రెక్కల చప్పుడు వినగలిగాయి,
ఆమెను పరివేష్టించిన భయంకర నిశ్శబ్దాలు
మహాద్భుత రహస్యంలో ఆమెను ముంచివేశాయి
ఆ నిశ్శబ్దాలు, నిగూఢ దివ్యరహస్యాలై
రంగుల వలయాలై ఆమె రథచక్రాల్ని చుట్టివేశాయి.
కాలపురుషుని అడుగుల సవ్వడులే, చప్పుడి
ఆమెకు దారి చూపాయి, అతని భయంకర
ప్రలాపాలు, ప్రతాపాలు, నిరుపయోగమైనాయి.

ఆ నిశ్శబ్దంలో వినగలది అంతర్ కర్ణేంద్రియం
ఆత్మానందంలో అది అనంతంగా వినగలదు
శబ్దరహితమైన భావం తీవ్రమైన కాలది

జీవితానికి ఆవల నిశ్శబ్దంలో సమీకరించి
ప్రపంచ సవ్వడులు మందంగా, మధురంగా వినిపిస్తాయి
తపస్సమాధిలో రగిలే తాపమే తపమై
అంతర్గతంగా పురోగమనానికి సహకరిస్తుంది.

ఆర్భాటపు అవసరాల భయంకర శబ్దాలకు దూరంగా,
నిశ్శబ్దంలో మేధస్సు సర్వాన్ని గ్రహించగలుగుతుంది
బాహ్య సంకల్ప అంధకారానికి దూరంగా విశ్రమించి
ఆమె ప్రేమ ఊర్మిగా, సాఫల్యం పొందగలుగుతుంది
మన రూపాలకు జన్మనిచ్చిన ఆత్మకు అన్నీ తెలుసు.

ఇంద్రియ లోలత్వంలో ప్రతిఫలించే ఆత్మ
భౌతిక ప్రపంచంలో ఒక జీవుడుగా సంచరిస్తూ
ఆమెలో విముక్త శూన్యాన్ని కనుగొన్న
అయినా ఆమె అనుబంధం పెంచుకొని లోకం ఉండదు.

అమ్మ హృదయం మనకోసం నిర్మలంగా ఉంటుంది
అమ్మలోని అనురాగ వాత్సల్యాలు పవిత్ర క్షేత్రాలు.
అమ్మ ప్రేమ అనంతం, స్వార్థరహితం
అమ్మ అందించే ఆనందాలే అవిన్నిశక్తులు—
సరాగంతో అమ్మ రహస్యాలను అందిస్తుంది.
ఆమె కళ్ళలోని పవిత్రత సురక్షితం
అమ్మ హృదయమే ఆనంద రసభాండం
ఆమె పర్వత శిఖరాలు, ఉదయాగ్ని కేంద్రాలు
అవి సాగరాలు చుంబించే నగ్న తీరాలు
అరణ్యాలు వినిపించే భవిష్య గీతాలు.

ఆమె కన్నవి ఏకాంత ఆనంద క్షేత్రాలు
తేజోవర్షాలతో పులకించిన ఆనంద భూములు
పక్షుల కలరవాలు, సుమసౌరభాల మధ్య ఒంటరిగా
వెన్నెల ప్రాసాదాలు, అద్భుతావహాలు

నక్షత్రాలు వెలిగించిన మసక సాయంతనాలు-
అనంత నిశీధంలో ఆమె మందంగా సంచరించింది.

సృష్టికర్త దృష్టిలో ఆమె మహనీయ, మానవీయ
వసుధ ఎదలో ఆతని చేరువను అనుభవించి
తెరచాటుమన్న తేజస్సుతో సంభాషించింది
పరంలోని పరమాత్మతో అభిభాషించింది.
తన శాంతి వల్ల కలిగే ఆనందం అనుభవించేందుకు
ఆమె కొద్దిమంది జీవులను మాత్రం ఆహ్వానించింది
వారికి ఆ శాంతి సీమలు, శిఖరాలు సహజ నెలవులే.

సమర్థ రాజర్షులు, తమకృషి ఫలితంగా
కర్తవ్యం అనే భయంకర ఒత్తిడి నుండి విముక్తమై
ఈ నిర్జన ఏకాంత క్షేత్రాల, ఆమె సన్నిధిని చేరారు
ప్రతిష్టంభన సమసి, ప్రశాంతి ముంగిట నిలిచింది.

వారిక్కడ పశుపక్ష్యాదులతో జీవించగలరు,
ఎండలో తిరిగి, ఆకులతో సంభాషించగలరు,
నిశీధంలో భయంకర వాయువుల్ని భ ుంచగలరు
నిశ్చలంగా ప్రకాశించే తారలతో చెలిమి చేయగలరు
ఆకాశపు పందిరి క్రింద, ప్రభాతంలో విశ్రమించగలరు
వారికి సంధ్యలు, అపరాహ్ణాలు అన్నీ ఒక్కటే.

కొందరు మరింత లోతుకుపోయి, జీవిత బాహ్య
బంధాలు త్రెంచుకుని, దివ్య రహస్యం తెలుసుకోగలరు
ఆత్మ సామ్రాజ్యంలో, నక్షత్ర కాంతిలో
వారు అనంత, అమేయ బ్రహ్మానందం అనుభవిస్తారు.
ఆ ప్రశాంతిలో, బ్రహ్మానంద స్థితిలో వారు
అమరవాణిని వినగలరు, దివ్యకాంతిని కనగలరు-
కాలం కల్పించే విభేదాల్ని అతిక్రమించగలరు
వారి హృదయ తంత్రులచే ఈ ప్రపంచం ఏర్పడ్డది

హృదయంతో స్పందించగల ప్రతి హృదయానికి చేరువై
అవాజ్యప్రేమ ద్వారా అందరిలో నున్న ఆత్మను చేరగలరు.

అటు నిశ్శబ్దానికి, శబ్ద ప్రపంచానికి అనుగుణంగా,
చెరసాల వంటి మనస్సు ముడిని వదులు చేస్తారు.
అశ్రమంగా వారు సాక్షీమాత్రులు కాగలరు
వారి ఆధ్యాత్మిక నేత్రానికి ప్రకృతి గోచరమవుతుంది
ప్రతి నిత్యం ఆరోహణలో ఉన్నత శిఖరాల్ని చేరతారు.
సత్యం పైలోకాల నుండి వారికి అందుతుంది
మాన్మక తేజస్సు అనంతంగా వారిపైన ప్రకాశిస్తుంది.
ఇల్లు, వాకిలి వదలి వేసిన సర్వసంగ పరిత్యాగులు
వాంఛలకు అతీతులై నిశ్చలంగా, నిర్మలంగా
జీవులకు దూరంగా, ఏకాంతంగా, నిశ్చలంగా కూర్చుని
ఆత్మోన్నత శిఖరాలపై నిర్వికారంగా ఉంటారు.

సాధనవలన ఏర్పడే విశుద్ధి తేజోశిఖరాలపై
జడధారులైన తాపసులు నగ్నంగా సంచరిస్తారు
వారు మహాపర్వత శిఖరాలవలె నిశ్చలులు
వారిచుట్టూ, అంతాన్ని చేరాలన్న అనంతమైన
తహతహతో ఆలోచనలు ముసురుతుంటాయి.

ఆ మహర్షులు విశ్వలక్ష్యానికి అనుకూలురు
భౌతికరూపాలలో హసించే భగవంతునిచే తృప్తిపడి
కాని రోజులలో సైతం విచారంతో క్రుంగిపోరు.
కొండను కప్పివేసిన పచ్చని చెట్లవలె
ఆ మహర్షులను శిష్యులు పరివేష్టించిఉంటారు.
తమ స్పర్శతో వారిలో చైతన్యం కలిగించి.
అంతర ఔన్నత్యంతో శిఖరాలను చేర్చగలుగుతారు.

ఈ పరమపథంలో చిరకాలసాధకులైనవారు
తమ ఆధ్యాత్మికతృష్ణతో ప్రశాంతవెలుగుల చేరి

ప్రశాంతిలోని సంపదలను అనుభవించి
ఆశ్రమజీవనసాగరంలో పవిత్రస్నానాలు చేస్తారు,
అప్రయత్నంగా శాంతి వారిని శాసిస్తుంది
శాంతిప్రభావంతో మార్గాలన్నీ ప్రశాంతమవుతాయి.

ఈ లోకాలలో ఆధిపత్యం కాంక్షించే అమాయకులు,
రానున్నకాలానికి నాయకత్వం వహించగలవారు
శూన్యాకాశంలో దాచపంక్తిగా పెరుగుతూ
ఎండలో, గాలిలో గాండ్రించే సింహాలవలె

వారి దైవముద్రల్ని సాక్షికప్రజ్ఞతో స్వీకరిస్తారు.

తాము గానంచేసే ఉన్నతభావాలు రూపుదాల్చినట్లు
వారు మహత్తరచేతనను అధ్యయనం చేస్తారు
అదేసృష్టి కావ్యానికి మనల్ని అనుసంధిస్తుంది

వాటివాటి చిన్ని ఆత్మలతో బంధించి ఉంచదు
పరమాత్మ ప్రాభవం క్రింద, సరళమై, స్థిరమై
ప్రకృతిని మైత్రీబంధంతో పట్టివేస్తుంది
లోకాన్ని దిద్దే ఆ శక్తి ఆమెకు సంక్రమించింది.

సంకుచితబంధనాలు లేక, అందరిదీ ఒకే ఆత్మగా
సువిశాలమైన వెచ్చని వెలుగుసామ్రాజ్యంవలె
సర్వసమానత్వంలోని నిష్పక్షపాత ఆనందమై
ఆ మహర్షులు అందరిలో బ్రహ్మానందం అనుభవిస్తారు.

నెమ్మది నెమ్మదిగా దివ్య ప్రవేశానికి సహకరిస్తూ
తరుణహృదయాలలో అమృతబీజాలను నాటి
మానవజాతి నేర్వవలసిన మహాసత్యాన్ని బోధిస్తారు.
కొందరికిమాత్రమే స్వతంత్రద్వారాలు తెరుస్తారు.

యాతనామయ లోకానికి తేజస్సును ప్రసాదిస్తారు
కాలం బరువుల్ని దించుకొన్న జీవులవలె తృప్తితో
ఈ విశ్వశక్తికి వారు పాత్రలు, ఆధారభూతులవుతారు

కాంతిమండలంవలె సహజశక్తిని ఉపయోగిస్తారు
వారి భాషన, మౌనం, రెండూ భూమికి ఉపయోగాలే,
వారి సంస్పర్శతో మహత్తర ఆనందం జాలువారుతుంది.
ఆ వినిర్మలప్రశాంతిలో ఏకత్వమే మహత్తర సంపద
క్రూరజంతువులుసైతం తమవేటతో స్నేహం చేస్తాయి.
అసూయాద్వేషాలను అంతరింప చేసే ప్రయత్నంలో
జగన్మాత హృదయం నుండి ప్రేమామృతం వర్షిస్తుంది
గాయపడిన ప్రపంచానికి స్వస్థత చేకూర్చుతుంది.
ఇతరులు భావాల బందిఖానా నుండి తప్పించుకుని
కాంతి అవతరణకై నిశ్చలంగా వున్న మేధను చేరతారు
ఒకానొక అనామక శక్తి పొంది తిరిగివచ్చి
అణువణువునా కాంతి మధువుల్ని నింపుకుంటారు.
భవిష్య జ్ఞానం వాచ్యరూపంలో బయల్పడి
పరలోకాల్ని దాచిన సూక్ష్మవాణి వినిపిస్తుంది
తేజోగోళాలను వెలిగించే మహత్తును పొంది
వారు అమర శక్తులను, అనంతుని కీర్తిస్తారు.
ఆత్మలోతులనుండి దివ్య శబ్ద తరంగాలు వినిపిస్తాయి.
కొందరు నిశ్చల మహాసాగరం వంటిశక్తులను
వ్యక్తి పరం, ఆలోచనా పరం చేసుకుని,
ఉన్నతాసనంలో పరమాత్మ తేజస్సును దర్శిస్తారు.
పరబ్రహ్మ సంకల్పానికి సన్నిహితు లవుతారు
భూత, భవిష్యత్పథకాలను అంచనా వేస్తారు.
కొందరు రోదసి సాగరంనుండి వెలువడిన వక్షులవలె
అనంత తేజస్సులోకి ఎగిరి లయించిపోతారు
కొందరు నిర్వికారంగా విశ్వవున్నత్యాన్ని వీక్షిస్తారు
ప్రపంచం పట్ల అయిష్టంతోనే ప్రపంచానికి సాయపడతారు
కొందరు ఆత్మలో ఐక్యమైపోయి ఏదీ గమనించరు
ఆత్మ వెనుతిరిగిరాని సమాధిస్థితిని చేరుకుంటారు

వారికి అతీంద్రియ శక్తులేవీ లభ్యంకావు
వారికి జన్మబంధాలు, మానవ సంబంధాలు ఉండవు
కొందరు ఒంటరిగా నిర్గుణస్థితిని చేరుకోగలరు.

ఒక సూర్య కిరణం నీడలలో ప్రసరించినట్లు
ఆ సువర్ణకాంత సర్వాలంకృత రథంపై
తపోకేంద్రాలైన ఆశ్రమ భూములు చేరింది
అసుర సంధ్యవేళ, ఆశ్రమాలకు మరలి వెళ్ళే
ఆలమందలతో దారులు ధూళిధూసరాలైనాయి
మండు టెండలు క్రమంగా జారి చల్లబడ్డాయి
ఒకానొక ప్రశాంత తపోవనం చేరిన ఆమె
ఆశ్రమంలోని సహజమైన నైర్మల్యాన్ని
ఆచ్ఛాదనగా చేసుకుని ఆమె విశ్రమించింది.

సింహాలు, కపిల గోవులు చెలిమిచేశాయి
నదీ తీరాలపై చెట్లు ఆరాధించసాగాయి
ఎటు చూచినా పవిత్ర దేవాలయ ప్రశాంతత,
అవి ఆమె రథచక్రాల వేగాన్ని తగ్గించాయి.
ఆ పవిత్ర ప్రదేశంలో మనస్సు, ప్రాచీన
ప్రశాంత స్థితుల్ని జ్ఞాపకం చేసుకున్న
కాలంలో లయించిన శబ్దాలను హృదయం విన్న

అక్కడి తాపసోత్తముల సంపూర్ణ స్వేచ్ఛ
వారి ఆత్మలపై చిరముద్రలను మిగిల్చింది
చీకటి ఉషస్సులోనే, చీకటి వెన్నెలలోనే మేల్కొని
జ్యోతి కుమారి, ఆ స్పర్శను అభిలషించింది
మత్తుగా మూతపడిన కనురెప్పలలోని ఔన్నత్యం
అనంత ప్రశాంత మైత్రిని అనుభవించింది

ఆమె అన్వేషణకు జ్ఞాపకంగా సూర్యోదయమైంది
తానున్న చిరు ఆసనం నుండి ఆమె లేచి

అసంపూర్ణ కార్య నిర్వహణకు పూనుకున్నది
నిశ్శబ్దంగావున్న దేవుళ్లను 'వాంఛ' ప్రశ్నించినట్లు
ఒక నక్షత్రం అనంత విశ్వంలోకి జారిపోయినట్లు
ఆమె తన జీవన విధివలయాన్ని అనుసరించింది.

అక్కడనుండి మహా ఏకాంత ప్రదేశాలు చేరింది
అక్కడ మనిషి మానవతారంగం నిమిత్తమాత్రమే
అక్కడ మనిషి విశాల ప్రకృతిలో ఒంటరిగా జీవిస్తాడు
అదృశ్యశక్తులను స్వాధీనం చేసుకోడానికై యత్నిస్తాడు
కానీ ప్రపంచ సుఖసంపదలలో మునిగిపోయి
తన అనంతత్వాన్ని, గమ్యాన్ని మరచిపోతాడు.

ఆమెకు భూప్రపంచమే కొత్త అందాలను చూపింది
దూరంనుండి అదృశ్యవాణి ఆమెను సంభావించింది
పర్వత సానువులు, తమలో నెలకొన్న ప్రశాంతత
అరణ్యాలు తాము వినిపించే గీతాలాపనలు
ఆమెకు 'దివ్య' ద్వారాలను తెరచినట్లయింది

స్వాప్నిక సీమలలో నిస్తబ్ద ప్రకృతిలో
కాంతిహీనమైపోతున్న సాయంతన మృత్యుశయ్య
చీకట్లు ముసురుకున్న ఆకాశపు ఆకర్షణ
ఆమె యుగసంధ్య క్రీనీడలో విశ్రమించింది
ఆకాశ సోపానాలపై అన్వేషిస్తున్నట్లు
పర్వత శిఖరాలు తలెత్తి చూడసాగాయి.

నిర్జన, మరుభూములలో సంచరించసాగింది
అవి స్వర్గంలో నిద్రలో విశ్రమిస్తున్న శిఖరాలు
అవి చంద్ర కాంతిలో పహరాకాస్తున్న శిఖరాలు

ఆమె నిర్జనారణ్యంలో ఏకాంతంగా వయనించి
పక్షుల కలకలాన్నీ, కలరవాన్ని వినసాగింది

నిశ్చలకాంతిలో నిస్తబ్దంగావున్న క్షేత్రాలలో
మెరుస్తూ, మెలికలు తిరిగిన సర్పమార్గాన్ని అనుసరించింది.

ఎక్కడా నరసంచారం, పశుసంచారం లేని
సుందరారణ్య దుర్గమ సీమలను చేరుకున్నది

"ఎండి బీటలువారిన ఇసుక నేలలను దాటి"
క్రూరమృగాల మధ్య, నిశి విజ్ఞాపనలు విన్నది.

"ఆమె విద్యుక్త అన్వేషణ కొనసాగించింది"
విధి తనకై నిర్దేశించిన ఒక్క వ్యక్తి కనిపించలేదు
అందుకై ఆమె మానవజాతినే అన్వేషించసాగింది.

ప్రతిరోజూ ఒక మహత్తర నిశ్శబ్దమే
అన్వేషణలో రోజులు, మాసాలుగడచి పోసాగాయి
సూర్యుని ప్రతాపానికి నేల బీటలు వారింది
చంద్ర గాడ్పులతో వసుధ గుండె బ్రద్దలైంది
కానీ, కనిపించని తడి, ఆ వేడిని స్వాహాచేసింది
శైత్యపవనాలు లేక, ఆకాశం ఎర్రబారింది.

# సావిత్రి

## [ మొదటి భాగం ]

# మహోదయం

## సంక్షిప్త పరిచయం

సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ
అహంత్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః

"సర్వ ధర్మాలను పరిత్యజించి నన్ను మాత్రమే శరణువేడుకో. నీవు బాధపడ వలసిన పనిలేదు. నీ పాపాలన్నింటినీ హరించి నీకు మోక్షం ప్రసాదిస్తాను."

ఈ గీత శ్లోకమే అన్ని యోగాలకు ఆధారం. పై మాటలలో శ్రీ అరవిందులు మానవుడికి, భగవంతునికి మధ్యగల అనుబంధాన్ని గ్రహించారు. అన్ని మానవ ధర్మాలను త్యజించి సంపూర్ణంగా, దివ్యత్వంలో మునిగి పోవడం అన్న ఒక్క పనిని మనిషి చేయగలిగితే మిగత బాధ్యత భగవంతుడే స్వీకరిస్తాడు.

"నేను ఎవరు?" అని శ్రీరమణ మహర్షికి ఎదురైన ప్రశ్న. జరా, మృత్యు, రోగ, భయాలు గౌతముని ఎదుర్కొన్న ప్రశ్నలు :

"....ఎలా జీవించడం? ఈ జీవితంలో ఏదీ అనుకూలంగాలేదు. ప్రేమించడం తెలియదు. ఒక నిశ్చయంలేదు. చివరకు మృత్యువును సైతం నిగ్రహించలేం. ఎలా బ్రతకడం?" ఇవి మనిషి అస్తిత్వంగురించి అరవిందునకు ఎదురైన ప్రశ్నలు....ఈ అస్తిత్వసమస్యకు సమాధానమే సావిత్రి....

అయితే యోగం ఏమిటి మధ్యన?

శ్రీ అరవిందుని దృష్టిలో యోగం అంటే ప్రకృతిలోని కొన్ని ఉన్నత, ఉద్దీపిక శక్తుల్ని సమీకరించడం. వాటిని సాధనద్వారా స్వాధీన పరచుకుని మానవ వికాసానికి, మానవ విజయానికి ఉపయోగించుకొనడం-

అంటే ప్రకృతిలో ఉన్న శక్తులనే యోగి తన 'సాధన' ద్వారా గ్రహించాలి. అందుకు అనేకమైన పద్ధతులు ఉన్నాయి. కొన్ని పద్ధతుల వల్ల కొన్ని శక్తులు చేజారిపోవచ్చు. కొన్ని అసలు చేతికి అందక పోవచ్చు. అన్నిశక్తులను సాధకుడు అందుకో గలిగినది పూర్ణయోగంద్వారా. మనిషిలో శరీరం, మనస్సు, ఆత్మ అనే మూడు కోశాలున్నాయి. ఆ మూడూ కలిస్తేనే మనిషి. అంటే మూడు రకాల జీవితం ఉన్నట్లే. భౌతికజీవితం; మానసిక జీవితం, ఆధ్యాత్మిక జీవితం....మొదటి స్థాయిలో పనిచేస్తాడు, రెండవ స్థాయిలో ఆలోచిస్తాడు, మూడవ స్థాయిలో ప్రేమిస్తాడు. ప్రేమలో జీవిస్తాడు.

మనిషిని దివ్య జీవనంవైపు మళ్లించే యోగమార్గాలన్నింటినీ, మరి కొన్నింటినీ జోడించి తన యోగవిధానాన్ని 'పూర్ణయోగం' అన్నారు శ్రీ అరవిందులు మనిషి తనలోని అన్ని శక్తులనూ కూడ దీసుకుని పరబ్రహ్మతో సంధానం కావాలి. అప్పుడే మనిషికి కావలసిన పరిణామం సిద్ధిస్తుంది.

యోగలక్ష్యం మనిషి తన జీవితంలో చైతన్యాన్ని, దివ్యత్వాన్ని నింపుకోవడమే. మానవస్వభావాన్ని దివ్యస్వభావంగామార్చుకోవడమే. మన సంకల్పం దినచర్య, జీవితం అన్నిటినీ దివ్య ఉపకరణాలు చేయడం.

యోగసాధన లక్ష్యం మహాయోగి కావడమో, సిద్ధులు పొంది మహాత్ముడు అనిపించుకోవడమో కాదు. సిద్ధులు, శక్తులు వాటంతట అవి వస్తేరావచ్చు. యోగసాధన మోక్షం కొరకే కాదు. తపస్సు ఫలితంగా మోక్షం లభిస్తే లభించవచ్చు. అవి సాధకుని లక్ష్యాలు కారాదు. దివ్యత్వ సాధన ఒక్కటే యోగి లక్ష్యం.

లక్ష మంది యోగులలో వేలు, వందలూ కాదు కనీసం పదిమంది, కూడా నిజమైన సాధకులు కనిపించరు. మనం దివ్య జీవనం సాగిస్తే, అన్నీ అవే సిద్ధిస్తాయి. వేటివి కావాలని కోరవలసిన అవసరం లేదు.

యోగంచేయడం పుస్తకాలలో చదివినంత సులభంకాదు. జీవితం ధర్మక్షేత్రం కావాలి, హృదయం కురుక్షేత్రం కావాలి. తొలి ప్రయత్నంలో

అనేక అవరోధాలు, విఘ్నాలు ఎదురవుతాయి. అనేక ప్రతికూల శక్తులు విజృంభిస్తాయి. ఆ కష్టాలను, బాధలను ఓటమిని తట్టుకోడానికి సాధకుడు సిద్ధంగా ఉండాలి. ఒక్కసారి సమాధి స్థితిలోకి వెళ్లితే రహస్యంగా నిద్రిస్తున్న ప్రాకృతిక శక్తులు విజృంభిస్తాయి. అవి శారీరకంగా, మానసికంగా ముప్పు తిప్పలు పెడతాయి. కొన్ని శక్తులు సాధనకు సహకరిస్తే, కొన్ని నిరోధిస్తాయి. కొన్ని దాగుడు మూతలాడతాయి. సాధకుని విగ్రహాన్ని ఓర్పును సహనాన్ని పరీక్షకు పెడతాయి. నిర్భయంగా, దృఢంగా ముందుకు సాగితేనే సాధన.

యోగం కత్తిమీద సాము. మొదటి రుచి కటికచేదు. విషతుల్యం. కష్టాలను ఓర్చుకుంటే చివరకు 'అతి మధురం'. అదే సచ్చిదానందం ప్రసాదిస్తుంది. యోగి ముందు తననుతాను సంపూర్ణుడుగా తీర్చిదిద్దుకుంటే తర్వాత ఇతరులను, ప్రపంచాన్ని సరిదిద్దగలడు. యోగలక్ష్యం విశ్వకల్యాణమే కాని, వ్యక్తిగత మోక్షంకాదు.

శ్రీ అరవిందుల జీవిత లక్ష్యం మానవులను దివ్యజీవన పథంలోకి మళ్ళించడం. ఆ భూతలస్వర్గానికి మార్గంగా ఆయన 'సావిత్రి'ని రచించారు. 'సావిత్రి' కేవలం కథకాదు. కథా కావ్యమూ కాదు. అది 'ఆత్మిక చైతన్య లహరి'...అది మాత్మిక జగత్తులో ధృవతార. అది 'యోగసాధన'లో సాధకుడు దర్శించే దివ్యజ్యోతి.

సావిత్రి సాధ్వి. పుణ్యశీల. తన పాతివ్రత్యబలంతో మృత్యువాత బడిన భర్తను బ్రతికించుకుంది. అంటే విధిని సైతం ధిక్కరించి, 'విధి వ్రాత'ను చెరిపివేసింది. ఈ మహాకావ్యంలో సావిత్రి జగన్మాత అవతారం. ఆమె అపూర్వ సహనంతో, ధీశక్తితో, మానవ సహజమైన కష్టనష్టాలను భరించి, ఎదుర్కొని జయించింది. చివరకు 'మృత్యువు'ను సైతం ఎట్లా జయించ వచ్చునో చూపించింది. అంటే మానవులంతా మృత్యుంజయులు కావాలన్నది సావిత్రి అభిమతం, అరవిందుల ఆశయం.

సావిత్రి మరికొన్ని సత్యాలను ఆవిష్కరిస్తుంది. అవి సంకేతాలు. సంకేతాల రూపంలోవున్న సంపూర్ణ సత్యాలు.

ఎక్కడో కథ మధ్యలో వచ్చే క్లయిమాక్స్‌తో కావ్యం ఆరంభమయింది. గతం క్షణంలో 'ఫ్లాష్‌బాక్' అవుతుంది. సత్యవంతుడు మరణించవలసిన రోజు అది.... అంటే నారదమహర్షి పెట్టిన గడువు ఆరోజుతో పూర్తి అవుతుంది. సత్యవంతుడు సకల సద్గుణోపేతుడు అయినా అల్పజీవి. ఏడాదికన్నా బ్రతకడు అని చెప్పాడు నారద మహర్షి. అయినా సావిత్రి అతనినే వరించింది. ఆరోజుకోసమై ఎదురు చూచింది. ఆరోజు రానేవచ్చింది!

"అది పరమాత్మ జాగృతం కాని బ్రాహ్మీ ముహూర్తం...."

రాత్రి గడుస్తున్నది, ఉషోదయం కానున్నది: ఆమెకు మూడు రోజులుగా కంటిపై కునుకులేదు, త్రిరాత్ర వ్రతం చేస్తున్నది. 'సావిత్రి' మద్ర ప్రభువైన అశ్వపతి కుమార్తె. రాజ్యభ్రష్టుడై అరణ్యవాసం చేస్తున్న ద్యుమత్సేనుని కుమారుడు సత్యవంతుని ఏరి, కోరి వివాహం చేసుకున్నది. అత్త మామలతో, భర్తతో అరణ్యంలోనే కాపురం చేసింది. సావిత్రీ సత్యవంతుల ప్రణయం మానసికం. ఇద్దరూ ఏడాది సుఖంగానే వున్నారు. కానీ, సత్యవంతునికి అంతిమ ఘడియలు సమీపిస్తున్నాయని 'సావిత్రి'కి తెలుసు. అదే ఆమె కలవరం. అటు ఆసన్న మృత్యువుపై దృష్టి.

ఇందులో జీవి ఆరాటం, అంతా చిత్ర విచిత్ర సంకేతమయం. దానిలోకి చొచ్చుకుపోవడం దుస్తరం. అక్కడక్కడ మెరుపులుమెరుస్తాయి, చిత్రాలు కనిపిస్తాయి. ఒక చిత్తరువు, ఒక రూపం, సింబాలిక్‌గా కనిపించి, క్రమంగా విస్తరిస్తుంది. అది ఆకాశమంత విశాలం అవుతుంది.

మొదటగా కనిపించేది నిశి. గాఢాంధకారం. రాత్రి అంతా అలుముకున్న చీకటి వేరు, ఉషస్సుకు ముందర పరుచుకునే చీకటి వేరు.

కన్ను పొడుచుకున్నా కనిపించని చీకటి ఉషోదయానికి ముందర ఏర్పడుతుంది. ఆ గాఢాంధకారాన్ని చీల్చుకుని, ఉషఃరేఖలు ప్రసరిస్తాయి. ఉషస్సురాకతో చీకట్లు విచ్చుకుంటాయి.

ఆ 'ఉషోదయం' మనిషిలో కలిగే చైతన్యం. ఉషఃకాంత నిద్రమత్తు వదలించుకుని, దేవతామూర్తి అయింది. మనస్సు అజ్ఞానం నుండి, అంధ

కారం నుండి క్రమంగా బయటపడి వెలుగులు నింపుకుని పరిణామ క్రమంలో చివరకు దివ్యం కావాలి. చిన్నజీవి పరమాత్మకావాలి. అణువు బ్రహ్మాండం కావాలి,

మానవులు మేల్కొన్నారు. నిత్యకృత్యాలు ప్రారంభించారు. సావిత్రికి ఆరాత్రి నిద్రలేదు. ఆమె మనస్సు అక్కడ లేదు. అందరూ పనులలో మునిగిపోయినా, ఆమె హృదయం రానున్న ఆపదను ఆలోచిస్తోంది. పైకి కర్తవ్య నిర్వహణ చేస్తున్నా, అంతరంగంలో అలజడి, ముఖంపైన ప్రశాంతత.

అమరత్వాన్ని కాంక్షించే వారికది మహోదయం. స్వర్గాన్ని చేరాలన్నా, భగవంతుని చేరాలన్నా తేలికైన పనికాదు. 'సావిత్రి' రాకుమారి, తండ్రి చాటున ఉన్నంత కాలం సుఖాలు, భోగాలు అనుభవించింది, తాను వరించిన సత్యవంతుని పెళ్లాడి, కష్టాలు తెచ్చుకుంది. ప్రేమకోసం, ప్రేమవిజయం కోసం. మానవ విముక్తి కోసం, దివ్యత్వం కోసం ఆమె జన్మించింది. 'సావిత్రి' జగన్మాత. సత్యవంతుడు 'సత్య' ప్రతినిధి. 'సత్యం' మొదట మృత్యువాత పడ్డది. అంటే అజ్ఞానంలో చిక్కుకుందన్నమాట. సావిత్రి, జగన్మాత, తానుగా, తన ప్రేమతో, సత్యాన్ని జయించింది. 'ఆత్మ జ్ఞానం'తో 'సత్యాన్ని' పొందడమే మానవ జీవిత లక్ష్యం.

అది సావిత్రికి ముంచుకొస్తున్న మృత్యువుకు దివ్యజీవన సాధనకు మధ్య ఏర్పడిన సమస్య. అయితే పరబ్రహ్మకు విస్తరిస్తున్న చైతన్యానికి జీవునికి మధ్య ఏర్పడిన సమస్య. జగత్తుకు మహోదయం, సావిత్రికి ఉషోదయం. మరికొన్ని గంటలలో సావిత్రి యముని కలుసుకోవాలి. యమునిరాక ఆమె జీవితంలో క్లిష్టమైన ఘడియ. తన కర్తవ్యాన్ని విస్మరించి విధికి వదలిపెట్టడం అన్న సమస్యేలేదు. సావిత్రిలో దివ్యాంశ ప్రవేశించింది. ప్రాపంచిక బంధనాలనుండి మానవతను ఉద్ధరించాలని పూనుకున్నది. అది సంకల్పం, అది సావిత్రి సంకల్పం. ఆ దివ్య సంకల్పానికి సావిత్రి ఆలంబన అయింది.

విధి బలీయం అన్నారు ఋషులు, మహర్షులు. అంటే సావిత్రి ప్రయత్నం సఫలం కావడం కన్న విఫలం కావడానికే అవకాశాలు ఎక్కువ.

అయినా సావిత్రి ముందడుగే వేసింది. వెనుతిరిగి చూడదలచలేదు. అది తన కర్తవ్యంగా భావించింది, 'విధి' అనే రణరంగంలో పోరాటానికి సిద్ధమైంది.

సావిత్రి అధైర్యపడలేదు, నిరాశలో కృంగిపోలేదు. అచంచలంగా, స్థిరంగా, పోరాటానికి సిద్ధమైంది. తన ఆత్మను మేల్కొల్పి యోగ సాధన ద్వారా తనకు కావలసిన బలాన్ని దివ్యత్వాన్ని సంపాదించుకున్నది.

మృత్యువు సమీపించగానే ఆమె స్మృతికోల్పోయింది. అయినా గతం కళ్లముందు దోబూచులాడింది. యోగ సమాధిలో సైతం, కొన్ని ప్రాపంచిక విషయాలు మనస్సులో మెదులుతుంటాయి. ఆమె గతాన్ని మరచిపోలేక పోయింది. గతజీవితం కళ్లముందు కదలసాగింది. ఆ జ్ఞాపకాలు మధురాలు.

రాకుమారిగా గడిపిన రోజులు. యవ్వనం అందించిన ఆనందాలు, సత్యవంతునికై అన్వేషణ, నారదమహర్షి హెచ్చరిక, విధిని ధిక్కరించి పెళ్లాడడం, ఒక ఏడాదిపాటు అరణ్యవాసం, ఇప్పుడు ఆసన్న మృత్యువు. అన్నీ క్షణంలో ఆమె స్మృతిలో మెదిలాయి.

ఈ ప్రయత్నంలో తాను ఓడిపోతే సృష్టికి, స్థితికి అర్థం ఉండదు. శూన్యమే మిగులుతుంది. అందుకే ఘర్షణకు సిద్ధపడ్డది. సత్యాన్ని జయించాలి, రక్షించాలి. అప్పుడే 'ప్రేమ - సత్యం' సంగమంవల్ల దివ్యత్వం భువికి దిగివస్తుంది. మనిషి దివ్యస్థితిని చేరుకోవాలి. మృత్యువు అడ్డుపడినా ఆగకూడదు. చీకట్లకు, రానున్న వెలుగులకు మధ్య నీలమేఘాలు, ఆ మేఘాల చాటునుండి దివ్య తేజస్సు దిగివస్తుందా! లేక లోకమే అంధకారంలో మునిగిపోతుందా! ఏమో భవిష్యత్తు తెలియదు. మనస్సు నిండా చీకట్లు. తెల్లవారుతుందా? వెలుగు ప్రసరిస్తుందా! అమృతం ఆరగించే ముందు, హాలాహలాన్ని రుచిచూడాలా! ప్రతి యోగికి, సాధకునకు ఈ చేదు అనుభవం తప్పదు అతని 'ఆత్మ' కొంతకాలం కారుచీకట్లలో గడిపి తీరాలి. ఆ తర్వాతనే బ్రహ్మానందానుభూతి.

తీయని స్మృతులు ఆగిపోయాయి. ఇప్పుడు సావిత్రి భవిష్యత్తు సరిహద్దులపై నిలబడ్డది. మార్గం తెలియడంలేదు. ప్రస్తుతంలో కనిపిస్తున్న

మహాశూన్యం, మహాంధకారం గతంలో లేదు, భవిష్యత్తులో లేదు. ఉన్నది ప్రస్తుతం ఎదురైంది కర్తవ్యం.

ఇప్పుడామె యోగినీ కవచాన్ని ధరించింది.

అంతర్ముఖమైంది. ఆమె ప్రశాంతిలోకి జారిపోయింది. సమాధి స్థితిలో నిశబ్దం నిగూఢంగా పలకరించింది. ఆమె మానవ కాంత, కానీ ఆమెలో అమరత్వం వుంది. ఆమెలో మానవాతీత ప్రజ్ఞ వుంది. ఆమె భౌతికంగా కనిపించినా, ఆమెలో ప్రాపంచికత లేదు, ఉన్నదంతా దివ్యత్వమే,

కనుక ఆమెను మృత్యువు భయపెట్టలేదు. అజ్ఞానానికి మృత్యువుకు ఆమె చలించలేదు.

భౌతిక ప్రపంచానికి బంధ విముక్తి కలిగించి 'మానవత్వం స్వేచ్ఛగా ఆధ్యాత్మిక స్వర్గం చేరే మార్గాన్ని ఏర్పాటుచసిద్ధమైంది. మానవత్వాన్ని బంధ విముక్తం చేయడానికి ఆమె సృష్టిధర్మాన్నే ఎదిరించింది:

ఆమెకు తన శక్తి తెలుసు. కాని ఫలితం ఎట్లా ఉంటుందో తెలియదు. విజయం సాధించడం అసంభవం మాత్రంకాదు.

మనిషిది రక్త మాంసాలతో నిర్మితమైన శరీరం. అది శాశ్వతంగా ఉండదు, మనిషిలో శాశ్వతమైంది 'ఆత్మ' ఒక్కటే. దానికి మృతిలేదు. అది క్షయంకాదు. 'ఆత్మ' అంటే దివ్యలోకాలనుండి నక్షత్రపీఠాలనుండి దిగివచ్చే ఒక కాంతి కణం. 'ఆత్మ' ఒక్కటే శరీరంలోని భగవత్ప్రతినిధి. దానిని జాగృతంచేసే వరకు కదలదు మెదలదు. కుండలినీ శక్తి అందాన్ని, మహత్తునీ చూడాలంటే, దానిని నిద్రలేపాలి. ఆత్మ విషయమూ అంతే. వేదనచెందినపుడు ఆత్మ నిద్రలేస్తుంది. మత్తు విడిపోతుంది దైవత్వాన్ని ఆకాంక్షిస్తుంది.

'సత్య' వంతుని, మృత్యువు కబళించాలని వచ్చినపుడే, సావిత్రి రంగంలో దిగింది.

ఆమె స్వధర్మంతో, ఆశతో కర్తవ్య నిర్వహణకు ఉపక్రమించింది.

సావిత్రి ఎవరు ? ఎందుకీ ప్రయత్నంచేస్తున్నది? ఆమె ఈ సమస్యను ఎదుర్కొవడం ఎందుకు ? సావిత్రి 'విశ్వకామన' వల్ల జన్మించింది.

'విశ్వకామన' రూపం యిచ్చిన వాడు అశ్వపతి. అశ్వపతి కేవలం 'మద్ర' ప్రభువుకాదు. ఒక జాతికి ప్రతినిధికాదు. సృష్టిలో ఉత్తమసృష్టి అయిన మానవునికి ప్రతినిధి. అంటే మానవజాతి సమస్తం 'జగన్మాత' ఆవిష్కరణను వాంఛించింది. దివ్యత్వం భువిపై అవతరించి రూపుదాల్చాలని వాంఛించింది. ఆ వాంఛ 'అశ్వపతి' ద్వారా అభివ్యక్తమైంది. ఆయన 'జీవాత్మ'. ఆయనయోగం తపస్సు, అన్నీ 'పరమాత్మ' కోసమే. పరబ్రహ్మ సాక్షాత్కారం కోసమే. బ్రహ్మజ్ఞానం కోసమే. తపస్సు చేసేప్రతివ్యక్తి, ప్రతియోగీ ఒక 'అశ్వపతి'. తన పూర్ణ యోగలక్ష్యాన్నే అరవిందులు 'అశ్వపతి'లో ప్రతిష్ఠించారు.

ఈ శరీరం శాశ్వతంకాదు. ఇది సంపూర్ణంకాదు. పైకి కనిపించే ఈ రూపం వెనుక అనేక పొరలున్నాయి, అనేక రూపాలున్నాయి.

పిపీలికాది బ్రహ్మపర్యంతం సర్వసృష్టి మనిషిలో నిక్షిప్తమైవుంది. మనిషి తాను తానై సంపూర్ణుడు కావాలి.

అశ్వపతి తన ఆత్మలోకి చొరబడినకొద్దీ అతని సహజ చర్యలు తగ్గిపోయి- ఉత్తమ పురుషుడై, ఉన్నత లోకాల్ని గమనించగలిగాడు. మనస్సును, వివేకాన్నిదాటి 'ఆత్మ'ను దర్శించాడు. 'ఆత్మ'లో అన్నీ కొత్తలోకాలే. అక్కడి ఇతర లోకాలతో, ఇతర జీవులతో, 'జ్ఞాన' సంబంధాలు ఏర్పరచుకున్నాడు. అక్కడి అనుభవాలు అనంతాలు, వర్ణనాతీతాలు. ఆత్మ అన్ని లోకాలను తిరిగిరాగలదు. జీవుడు అన్నిజీవులతోను కలిసిపోగలడు.

శరీరం నుండి విశ్వంలోకి. విశ్వంనుండి అతీంద్రియ స్థితిలోకి ఆత్మ పురోగమిస్తుంది. అశ్వపతి ఆ 'పర' లోకాలన్నీ దాటి అరూప శూన్యస్థితికి చేరుకున్నాడు.

అశ్వపతి (అంటే యోగి ఆత్మ) అక్కడినుండి వెనుతిరిగాడు, అతీంద్రియ జలాలలో సుస్నాతుడైనాడు. పరిశుద్ధుడైనాడు. అలా తిరిగి రావడం అంటే పునర్జన్మ ఎత్తినట్లే. పరప్రజ్ఞను వెంటతెచ్చుకొని, ప్రవిమల జీవనం సాగించవచ్చు. 'సత్య' శుద్ధుడైనాడన్నమాట. ఆధ్యాత్మికంగా ఎంతో తృప్తి, ఎంతో ఆనందం. ఆప్రభావం చాలాకాలం ఉంటుంది. జాగృతమైన

ఆత్మ, సదా ఆ దివ్యత్వాన్నే అనుసరించాలని ప్రయత్నిస్తుంది, భౌతిక లాలనను వాంఛించదు. ఇక్కడ సుఖాలను, ఆనందాలను లెక్కచేయదు. అశ్వపతిలో అదే పరివర్తన, ఆత్మోన్మీలన, అదే ఆనందం, అదేశక్తి.

దివ్యజ్ఞానం కలిగింది: నిజమే, దివ్యశక్తులు సమకూరాయి. వాటివల్ల ఏమిటి ప్రయోజనం? ఆ ప్రజ్ఞను ప్రపంచ విషయాలకు అన్వయించాలి.

అలాఅన్వయించినపుడే 'యోగం' సంపూర్ణమవుతుంది. పురోగమనం సాధ్యమవుతుంది. ఆ ఫలితం తన ఒక్కనికే కాక, తన చుట్టూఉన్న వారికి, మొత్తం మానవ జాతికి, ప్రపంచానికి ఉపయోగిస్తుంది.

కొమ్మలు, రెమ్మలతో విస్తరించిన విశ్వవృక్షాన్ని అశ్వపతి చూడ గలిగాడు. అదే అశ్వర్థం. జగన్మాత శక్తి సర్వత్రాఉంది. అది మన కంటికి కనిపించకపోవచ్చు. దివ్యత్వం దిగివచ్చి పదార్థంలో దాక్కుంది. అది తిరిగి పైకిలేవాలి. పరిణామంలో పురోగమించాలి. పరిణామంలో తొలి పాఠాలు తెలుసుకున్న అశ్వపతి తన 'ఆత్మ అజ్ఞానం నుండి విముక్త' మైనట్లు గ్రహించాడు. అతని మనస్సు, శరీరం తొలి ఆధ్యాత్మిక పరిణామా లకు గురైనాయి.

ఇప్పుడు అశ్వపతి నూతన వ్యక్తి. మహదాంశలను తెలుసుకోగల ప్రజ్ఞ అతనికి కలిగింది.

'ఆత్మ' రంగంలో కొత్త సాహసాలు చేయడానికి, కొత్త ప్రయో గాలు చేయడానికి అశ్వపతికి జ్ఞానం తక్కువ. 'యోగం'లో ప్రయోగాలు చేయదలచిన వానికి 'విషయం' తెలిసిఉండాలి. ప్రాచీన గ్రంథాల పరిచయం అవసరం. అది గుప్తవిద్య. అవి చదివి కొందరు ఉత్సాహంతో ముందడుగు వేస్తారు. కొందరు భయంతో ఆగిపోతారు. గుప్తజ్ఞానం 'యోగి'కి మార్గదర్శకంగా ఉంటుంది. అశ్వపతి, ఆ గుప్తవిజ్ఞాన భాండారం తెరిచాడు.

పురోగమనం రెండు వైపుల నుండి ఒకే బిందువు వైపుసాగి, ఒక చోట కలవడం,- ఒక దిక్కున చైతన్యారోహణ, పరార్థ, భౌతిక, మానసిక మండలాల నుండి ఊర్ధ్వ మండలాలకు, మరొక దిక్కున- దివ్య చైతన్యం పైనుండి క్రిందికి దిగి రావడం, రెండు శక్తులు ఒక

చోట కలవాలి, అక్కడ రాపిడి, అక్కడే విద్యుత్తు పరిణామం. అంత కాలం ప్రచ్ఛన్నంగా పరమాత్మ సహాయం ఉంటుంది. ఆ పరమాత్మ మనలోనే ఉండి, తానే దారిచూపిస్తూ, తానే ఇంద్రియాలై, ఆత్మ వికాసానికి సాయపడుతుంటాడు. ఆత్మవికాసం కలిగిన తర్వాతకూడ చేదోడు వాదోడుగా ఉంటాడు. ఇది అంతా గుప్తంగా జరిగేదే కానీ, కంటికి కని పించదు. వాస్తవమే కానీ, కనిపించని వాస్తవం. అది తెలుస్తూనే ఉంటుంది. అది ఇక్కడ ఈ శరీరంలోనే జరుగుతుంది. మన హృదయాలలో, మన ఆత్మలలో జరుగుతున్నా తెరవెనుక జరుగుతున్నట్లు మనకు కనిపించదు.

మన ప్రగతికి సహాయంచేసే శక్తులన్నీ మన లోపలనేఉన్నాయి. అవి ఉన్నట్లు మనకు తెలియదు. ఉన్నట్లు గ్రహించం. పైగా నిత్యనైమిత్తికలకు బానిసలం అయిపోయి అజ్ఞానంలో ఉండిపోతాం.

మనిషి గాఢాంధకారంలో ఉన్నప్పుడు ఆ దివ్యశక్తి సాయంగా వస్తుంది. మనస్సు, అంతర్మందిరాలు కొత్త శక్తిని పొందుతాయి. భూమి అంతా విచిత్రంగా దివ్యం అవుతుంది.

మనిషి నిరాశపడ నవసరం లేదు. దివ్యసహాయం ఎప్పుడూ సిద్ధంగా ఉంటుంది. దేవతలు దిగిరానవసరంలేదు. పైనుండి దిగివచ్చిన శక్తి చాలు మనల్ని నడిపించడానికి. అదే పురుష-ప్రకృతి-అదే దివ్యశక్తి.

పురుషుడు కొంత కాలం అజ్ఞాతపు ముసుగులో ఉండడానికి అంగీక రించి 'ప్రకృతి' ఆడించినట్లు ఆడుతుంటాడు.

ఆమె గీచిన గీతలలో నడుస్తూ, ఆమెతో సహకరిస్తూ, అందులోనే ప్రయోజనం లక్షించి, ఉన్నత శిఖరాలను చేరతాడు.

మనలో మనకు తెలియకుండా, రహస్యంగా ఉన్న పరమాత్మ శక్తి, మనల్ని తనంతవారు కమ్మని ఆదేశిస్తుంది.

పురుషుడు, ప్రకృతి ఇక్కడ పెనవేసుకొని ఉంటారు. వారు తన్మయ స్థితిలో కొత్త సృష్టికి పూనుకొంటారు. పురుషుడు తానే జీవి, తానే సృష్టి. ఆమెతో అనుసంధానం జరిగినపుడే సృష్టి జరుగుతుంది. జీవాత్మ సత్య మైంది. పైనుండి దివ్యత్వం దిగివచ్చినప్పుడు అందుకొనడానికి మానవత్వం సిద్ధంగా ఉండాలి.

మహర్షులు అందించిన అనుభవజ్ఞానం అంతవరకే పరిమితమైంది. అది 'ఆత్మవిద్య'. అది మన ప్రయత్నానికి కొంతవరకే ఉపకరిస్తుంది. మరో ముందడుగు వేసి ఆధ్యాత్మిక పరిణతిని సాధించాలి. పూర్వ విజ్ఞానం వల్ల ఆత్మ 'విముక్తి' మాత్రమే సాధ్యం. ఇప్పుడు ఎటు వెళ్లాలో, ఎలా వెళ్లాలో మార్గం తెలిపింది. గుర్తులు తెలిశాయి. మలుపులు, రహస్యాలు తెలిశాయి. ఆ రహస్యాన్ని భేదించడానికి పూనుకున్నాడు అశ్వపతి.

తన పరిమిత మనస్సును, భూలోకంతో బంధించే దారం తెగిపో యింది-మానవ బంధాలు, అలజడులు లేవు. అంతా స్వేచ్ఛ.

ప్రకృతిని పరిశీలించగలిగాడు. ప్రకృతి సూత్రాలను తెలుసుకోగలి గాడు. ఈ జగత్తుకు మూలకారణం గ్రహించ గలిగాడు.

అపరిష్కృతంగా, జటిలంగా ఉన్న సృష్టిరహస్యం అశ్వపతికి అవ గతమైంది. అయినకొద్దీ అతని అవగాహన ఎక్కువైంది. కానీ ప్రాపం చికమైన పరిమితులు, వైఫల్యాలు అతనిని బాధించసాగాయి.

మనిషి తన గమ్యాన్ని తానే నిర్దేశించుకోవచ్చు, తన విధిని తానే ఏర్పరచుకోవచ్చు అన్న ఆలోచన రాగానే పరమానందమైంది అశ్వపతికి-

అప్పుడు మరింతలోతులకు వెళ్లగలిగాడు. ప్రయత్నపూర్వకంగా శూన్యంలో జొరబడ్డాడు. అది మనస్సులో ఏర్పడిన 'ప్రశాంత'స్థితి. ఇది యోగసాధనతో ప్రతి యోగి కాంక్షించేదే. ఆ తర్వాతనే ఆధ్యాత్మిక అను భవాలు కలుగుతాయి. 'అనుభవస్థితి'ని సైతం దాటి నిశ్చలస్థితికి వెళ్ళ వచ్చు. అశ్వపతి ప్రాపంచిక స్థితుల్ని దాటి 'అగ్నిశిఖ'వలె పైకిలేచాడు. భగవంతునికి తనను తాను నైవేద్యం చేసుకున్నాడు. మధ్యలో అవరో ధాలు ఏర్పడినా లెక్కచేయలేదు, ఆగలేదు.

అశ్వపతి చైతన్య స్థితిని దాటి పైపైకి వెళ్ళిపోయినాడు.

ఆ దివ్య ఆలింగనంలో అతని స్థితి మారిపోయింది. అతని కళ్ళ ముందు మహత్తరలోకాలు విచ్చుకున్నాయి. భూలోక బాధలు నశించాయి. మనస్సు దివ్యమైన మధ్యవర్తిగా నిలిచి, భూమిపైన అజ్ఞానాన్ని నిర్మూలించ

సమకట్టింది. ప్రకృతి, మానవ ప్రకృతి, ప్రవృత్తి అన్నీ అశ్వపతి ఇచ్ఛకు లోబడిపోయాయి.

ఇప్పుడు అతనిది చిత్రమైన లోకం. అదే ఇంద్రియాల్ని శాసిస్తుంది. మనం ఆత్మలోకి జొరబడినపుడు, మహత్వాలు అందివస్తాయి. అంతర సత్యంతో, ఆదిశక్తితో, ఆత్మచైతన్యంతో నిండినప్పుడే అంతర్లోకాలు కని పిస్తాయి. అప్పుడు మన అధీనంలో లేనిదంటూ ఏదీ ఉండదు. మన దృష్టికి కనిపించని దంటూ ఏదీ ఉండదు.

అశ్వపతికి జ్ఞానలోకం దర్శనమైంది.

ఆరోహణకు, అవరోహణకు ఉపకరించే ఆధ్యాత్మిక సోపానాలు అశ్వపతిని ఆహ్వానించాయి. ఒక్కసారిగా అవరోహణం- అఖాతంలో పడినట్లు అయింది. వెంటనే ఆరోహణ....ఉన్నత భావశిఖరం పైకి. ఆరెంటిమధ్య అన్నిలోకాలు, సర్వసృష్టి ఇమిడివుంది. వాటినిచూచి అశ్వపతి, కలవర పడ్డాడు, ఆశ్చర్యపడ్డాడు.

ఇది అశ్వపతి 'యోగం'లో మొదటి దశ. ఇందులో మనో ఆధ్యాత్మిక పరిణామం రెండవది. ఆరెంటి నడుమ గుప్తవిద్యారహస్యాలు తెలుసు కోవాలనే జిజ్ఞాస కలుగుతుంది. అంటే మొదటి యోగ విభూతివల్ల జిజ్ఞాస రగిలింది, పెరిగింది. యోగ విజ్ఞానాన్ని అందుకోగల శక్తి ఏర్పడ్డది. ఆర్జిత విజ్ఞానం, రెండవ సాహసానికి ధైర్యాన్ని యిచ్చింది. మొదట ఏకాంతమెమో అనిపించిన ఆధ్యాత్మికత వల్ల, మెరుపులవల్ల ఆసక్తి మిక్కుటమైంది. మహోన్నత శిఖరాలు ఆరోహించాలనే తపన కలిగింది, ఆతర్వాత యోగాను భవాలు తనొక్కడికే ఉపయోగించేవికావు. మొత్తం మానవజాతికే యోగ్య మైనవి, అవసరమైనవి. అశ్వపతి ఒక వ్యక్తికాదు, ఒకసమాజం. మానవ ప్రతినిధి. ప్రతి మనిషిలోని ఆత్మ అశ్వపతి ఆత్మవంటిదే. అశ్వపతి అనుభవాలు, అనుభూతులు యోగులందరివీ· అవి మానవులందరివీ కావాలి.